

Quest for Liberty - (one) 1977
Collection : A P Lalit Kala Akademi, Hyderabad

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 7 డిసెంబర్ 1995 సంచిక 7

సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**


## విషయసూచిక



ముఖచిత్రం :
**సముద్రగుప్తుడు.**
చిత్రకారుడు : అడివి బాపిరాజు


Printed, Published and Edited by RAVINDRANATH ALAPATI at Kala Jyothi Process Ltd , 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

**Editorial Nest**

Plot No: 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad - 500 033. Ph. 247717.

# అడవి బాపిరాజు కళాతృష్ణ
## (శతజయంతి సందర్భంగా)

- డా. సంజీవదేవ్

ప్రతి ప్రాణి కూడ ప్రాణంతో జీవిస్తుంది

మనిషి కూడ ప్రాణంతో జీవిస్తాడు. అంతవరకు మానవునికీ ఇతర జీవులకూ భేదం లేదు. అయితే మానవునిలో వున్నట్టి మెదడు మిగతా జీవులలో వుండదు. వాటికి మెదడు వున్నా అది మరో రకం. కనుక మానవుని వలె ఇతర జీవులు ఆలోచించలేవు. మానవుడు ఆలోచించగలడు, అనుభూతించగలడు. అయితే మిగతా జీవుల అనుభూతికీ, మానవుల అనుభూతికీ సామ్యం లేదు.

అదే విధంగా మిగతా చాలా మంది అనుభూతులకూ 1895 లో పుట్టి 1952 లో మరణించిన అడవి బాపిరాజుగారి అనుభూతులకూ ఎంతో భేదం వుంది. చాలా మంది అనుభూతులు సృజనాత్మక దశను పొందకుండా తమలోనే వుండి పోతాయి. వారంతా అనుభూతి పరులే కాని కళాకారులు కారు. బాపిరాజు గారి లాంటి కొందరు ప్రత్యేక వ్యక్తులు కళాకారు లెందుకు అయినారంటే వారిలోని భావజగత్తు వివిధ ప్రక్రియల ద్వారా భౌతిక జగత్తులోకి రూపాంతరం చెందుతున్నందున. వారిలోని భావం రూపంలోకి రూపొందుతున్నందున.

బాపిరాజు గారిలోని విశిష్ట విశేషం ఏమంటే ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆయన కవి,గాయకుడు, చిత్రకారుడు, కథానికాశిల్పి, నవలా రచయిత, ప్రతిభ గల పాత్రికేయుడు, వక్త, సంభాషణా చతురుడు, ప్రగాఢ ఆలోచకుడు, ఈ విధంగా ఎన్నో, మరెన్నో, ఇంకెన్నో. అయినా, ఆయన అభిమానం, అభిరుచి మాత్రం రంగూ రేఖల మీద ఎక్కువగా కేంద్రితమై వుండేది. కనుకనే బాపిరాజు అనగానే చిత్రకారుడు ప్రత్యక్షమవుతాడు ప్రధానంగా.

ఆయన పశ్చిమ గోదావరి జిల్లా శిరిపల్లిలో జన్మించి, భీమవరం, నరసాపురం, విజయవాడలలో విద్యాభ్యాసం చేసి రాజమండ్రిలోని కళాశాలలో ప్రవేశించాడు. ఆ కళాశాలకు ఆ రోజుల్లో ఆస్వాల్డు కూల్ డ్రే అనే బ్రిటిష్ ప్రతిభాశాలి ప్రిన్సిపాల్‌గా వుండేవాడు. ఆయన అనేక సాంస్కృతిక ప్రతిభలను కలిగి వుండేవాడు. వాటిలో కవితారచన, చిత్రరచన ప్రముఖ మైనవి. బాపిరాజుగారి మీద ఆయనకు ప్రత్యేక అభిమానం వుండేది. ఆ రోజుల్లో భారత దేశంలో చిత్ర రచనా, శిల్పనిర్మాణం కూడ పాశ్చాత్య రీతుల్లో వ్యాప్తి చెంది వుండేది. కూల్ డ్రే మహాశయుడు అటు పాశ్చాత్య రీతుల్లోను, ఇటు భారతీయ రీతుల్లోను కూడ నిష్ణాతుడు. వాటన్నిటినీ కూడ బాపిరాజులో ప్రవేశ పెట్టి అటు సాహిత్యంలోను, ఇటు చిత్ర రచనలోను ప్రవీణుణ్ణి చేశాడు.

ఆ కాలంలో మచిలీపట్నంలోని ఆంధ్ర జాతీయ కళాశాలలో నిపుణ చిత్రాచార్యులు ప్రమోదకుమార చటర్జీ చిత్రాధ్యాపకులుగా వుండేవారు. బాపిరాజుగారు రాజమండ్రిలోని విద్యాభ్యాసాన్ని ముగించుకొని ఆంధ్ర జాతీయ కళాశాలలో ప్రమోద కుమార చటర్జీ శిష్యత్వాన్ని స్వీకరించారు. ఆ విధంగా ఆయన ప్రత్యేకించి భారతీయ చిత్ర కళారీతుల్లో ప్రావీణ్యాన్ని సంపాదించారు. ఆ నాటి భారతీయ చిత్రకళను పునర్జీవింప జేసిన అవనీంద్రనాథటాగూరు అనేక మంది యువ చిత్రకారులను తయారు చేశారు. వారిలో ప్రమోద కుమార చటర్జీ ఒకరు. ప్రమోద కుమార చటర్జీ క్రింద తయారైన చిత్రకారుల్లో అడవి బాపిరాజుగారు ఒకరు.

భారతీయ చిత్రరచనారీతుల్లో రేఖకు ప్రాధాన్యత ఎక్కువ. పాశ్చాత్య రీతుల్లో రంగుకు ప్రాధాన్యత.

ప్రకృతిలోని వస్తువులను కనిపించేవి కనిపించే రీతిలో చిత్రించే వాస్తవవాదం పాశ్చాత్యులది వాటిని భావాత్మకంగా చిత్రించే ఆదర్శవాదం భారతీయులది. బాపిరాజుగారు ఆంధ్ర జాతీయ కళాశాలకు కొంత కాలం ప్రిన్సిపాల్‌గా కూడా పని చేశారు.

బాపిరాజుగారిలో మిగతా ప్రతిభలు ఎన్ని వున్నా కూడ ఆయన జీవితాన్ని ఆనందమయంగా నడిపిన ప్రధాన మానస శక్తి ఆయనలో రెపరెపలాడుతున్న కళాతృష్ణ. ఆ కళాతృష్ణనే సౌందర్యోపాసన అనవచ్చు. ప్రతి చిన్న వస్తువులో, ప్రతి చిన్నమాటలో, ప్రతిచిన్న కదలికలో కూడ ఆయన సౌందర్యానుభూతిని పొందేవాడు, రస తన్మయు డయేవాడు.

ఆయన చిత్రరచనలో సారాన్ని అందుకున్నంతగా సంఖ్యను అందుకోలేదు. ఆయన చిత్రాల సంఖ్యకంటె ఆయన రచించిన సాహితీ రచనల సంఖ్యయే ఎక్కువ. ఆయన రచించిన నవలల్లో "నారాయణరావు", "గోన గన్నారెడ్డి", "కోనంగి", "హిమబిందు", "తుఫాన్" మొదలైనవి వైశిష్ట్యాన్ని అందుకొన్నాయి. కేవలం గద్యరచనతోనే సంతృప్తి పడక రసవంతమయిన పాటలను, పద్యాలను కూడ రచించి రక్తికట్టించారు.

చిత్రరచనలో మూడు రచనారీతులు ప్రధానం - రేఖలేకుండా కేవలం రంగులరచన, రంగులేకుండా కేవలం రేఖల రచన, రేఖలు రంగులు రెంటి మిశ్రమ రచన. బాపిరాజుగారు ఈ మూడు విధానాల్లో కూడ సిద్ధహస్తుడు. కేవలం రేఖారచన ఎక్కువగా ఇతర్ల సాహితీ రచనలకు బొమ్మలు వేయటానికి ఉపయోగపడుతుంది. మౌలిక చిత్రరచనకంటే ఇతర్ల రచనలకు బొమ్మలు వేయటం కొంత తక్కువ సులభమైన పని. అయినా బాపిరాజుగారు అటువంటి తక్కువ సులభమైన పనిని కూడ ఎక్కువ సులభంగా నెరవేర్చకలిగేవారు. విశ్వనాధ సత్యనారాయణగారి "కోకిలమ్మ పెళ్లి"కి, "కిన్నెరసాని"కి,నండూరి సుబ్బారావుగారి "ఎంకి పాటల"కు చిత్రాలు వేశారు ఆయన. అంతేకాక తాము స్వయంగా రచించుకొన్న గీతికా సంకలనాలకు కూడ తామే చిత్రాలు వేసుకొన్నారు. ఇవన్నీ కూడ శుద్ధ రేఖాంకనలే. ఇంకా ఎన్నిటికో కూడ ఆయన రేఖాంకనలు చేశారు. అక్షరాలను రచించటంలో కంటే రూపాలను రచించటంలో ఆయన కెక్కువ మక్కువ. అందుకే బాపిరాజుగారు ముఖ్యంగా రూపకారుడు.

బాపిరాజుగారు ఇంట కూర్చొని చిత్రరచనలను చేస్తూ మాత్రమే సంతృప్తి పడకుండా ఎన్నో కళాక్షేత్రాలను, సాంస్కృతిక కేంద్రాలను సందర్శిస్తుండేవారు. కొన్ని పనులు కదల కుండా ఒక చోట కూర్చొని చేయటానికి పనికి వస్తే మరి కొన్ని పర్యటనలు చేస్తూ చేయటానికి పనికి వస్తాయి. 1951 లో మద్రాసు ప్రభుత్వం ఆయనను సింహళానికి పంపింది. అక్కడి సిగీరియా కుడ్య చిత్రాల ప్రతులను రచించి తెమ్మని. ఇక్కడి నుంచి మరి కొందరు చిత్రకార మిత్రులను తీసుకొని బాపిరాజుగారు సింహళం వెళ్లి ఆ పనిని విజయవంతంగా ముగించుకొని తిరిగి వచ్చారు. బాపిరాజుగారు చిత్రకారులు మాత్రమేకాక, కళా చరిత్రకారులు, కళాసమీక్షకులు కూడ. కళలను గురించి ఇంగ్లీషులో తెలుగులో కూడ కొన్ని వ్యాసాలను రచించారు.

ఆయన జలవర్ణచిత్రాలను, తైలవర్ణ చిత్రాలను కూడా ఎంతో నైపుణ్యంతో రచించారు. ఆయన జలవర్ణచిత్రాల్లోని కమనీయత, నమనీయత, కవితా సౌకుమార్యం, తైలవర్ణచిత్రాల్లో గాంభీర్యం, కాఠిన్యం, స్పృశ్యత (texture) మొదలైనవి ఎంతో అభివ్యక్తనీయంగా వుంటాయి. కేవల భావాభివ్యక్తి మాత్రమే చాలదు ఒక చిత్రంలోని గొప్పతనాన్ని తెలుపటానికి. దాని నిర్మాణ కార్యంలో పనితనం కూడ వుండాలి. పనితనం లేని కళాకృతి కేవలం భోగట్టా మాత్రమే అవుతుంది. కాని కళానిర్మాణం కాదు. ఈ కళా రహస్యం బాపిరాజుగారికి బాగా తెలుసు. కనుకనే తన చిత్రాల్లో రచనాకౌశల్యాన్ని ప్రదర్శించటానికి ఎంతో ప్రాధాన్యత నిచ్చేవారు ఆయన. ప్రేక్షకునికి ప్రధమంగా కనిపించేది చిత్రం ఎట్లా వుంటుందనేది. తరువాతి విషయం అందులో ఏమున్న దనేది. కనుకనే రూపకళల్లో ప్రధానమైంది నిర్మాణ-నైపుణి; రెండోది ఇతివృత్తం. సాహితీ కళల్లో ఇందుకు వ్యతిరేకత వుంటుంది

బాపిరాజుగారు రచించిన కళాఖండాలన్నీ ఒక చోట లేవు. కొన్ని విదేశాల్లో వుండి పోయాయి; మరికొన్ని మన దేశంలోనే అక్కడక్కడ ఆయన అభిమానుల వద్ద, స్నేహితుల వద్ద వుండి పోయాయి. డెన్మార్కులోని చిత్రశాలలో వీరి "శబ్దబ్రహ్మ" అనే చిత్రం ప్రదర్శించబడి వున్నది. "భాగవత పురుషుడు" అనే చిత్రం తిరువాన్కూర్ పాలకుల ప్రాసాదంలోను, "ఆనంద తాండవం" అనేది తిరువాన్కూర్ మ్యూజియంలోను, "సూర్యదేవుడు" అనేది బీహార్లోను వుండిపోయాయి. వీరి "తిక్కన" చిత్రానికి ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు ప్రథమ బహుమతిని ప్రసాదించారు. "సముద్రగుప్తుడు", "పార్వతీ పరమేశ్వరులు", "రాధాకృష్ణ" మొదలైనవి మనదేశంలోనే కొందరి చిత్ర సంగ్రహాలలో వున్నాయి.

ఇవి కాక "మృత్యుంజయుడు", "కిరాతార్జునీయం", "ధన్వంతరి", "సంధ్యానృత్యం", "నాగ నృత్యం", "చక్షుకి", "భిక్షుకి", "గౌతమబుద్ధుడు", "గోధూళి", "కృష్ణవేణి", "శశికళ" మొదలైన కళాఖండా లెన్నో రచించారు. వీరివి కొన్ని వర్ణచిత్రాలు భారతి మొదలైన ప్రముఖ పత్రికల్లో ముద్రించ బడినాయి. వీరి చిత్రాల్లోని ఇతివృత్తాలు ఎక్కువగా పౌరాణికాలు, చారిత్రకాలు. ఇటువంటి వాటితోనే సంతృప్తి పడక నిత్య జీవితంలోని సామాన్య ఘటనలను, సామాజిక దృశ్యాలను కూడ అనుభూతి మూలకంగా చిత్రించారు. ఆయనలోని కళాతృష్ణ లౌకిక జగత్తులోని, పారలౌకిక జగత్తులోని ప్రతి అల్ప, అనల్ప విషయాన్ని కూడ చిత్రించకుండా వుండ లేక పోతుండేది. ఆయన కవితలు శ్రవ్య చిత్రాలు, ఆయన చిత్రాలు దృశ్య కవితలు. ఆయన జీవితం ఒక సప్రాణ రసవాహిని. ఆ రేఖల నర్తన, రంగుల సంగీతం అద్భుత కళాఖండాలను సృష్టించాయి. అయినప్పటికీ ఆయన సృష్టించాలని కలలు కన్న వాటన్నిటినీ సృష్టించ లేకపోయినాడు. కొన్ని కలలు కలలుగానే నిలిచి పోయాయి. కల లన్నీ కళలు కాలేవు.

బాపిరాజుగారు ఎంతగా కళాపిపాసి అయినప్పటికీ కళా సంబంధాలు కాని కొన్ని ఇతరరంగాల్లో కూడ ఆయన పని చేశారు. కొన్నాళ్లు న్యాయవాదిగా కూడ వున్నారు. మరికొన్నాళ్లు హైదరాబాద్లోని "మీజాన్"అనే వార్తా పత్రికకు సంపాదకత్వం నిర్వహించారు. ఆయన జీవితంలోని మరో విశేషం ఏమంటే ఏ పనిలో కూడ ఎక్కువ కాలం స్థిరంగా వుండ గలిగేవారు కారు. మానవజీవితంలో మార్పు లేకపోవటం ఒక లోపం, సందేహం లేదు. కాని ఆ మార్పులు ఎక్కువగా వుంటూండటం కూడ ఒక పెద్ద లోపం.

చాలా మంది కళాకారుల జీవితాల్లో వ్యావహారిక దశ తక్కువగాను, రసాత్మక దశ ఎక్కువగాను వుంటుంటాయి. ఈ విషయంలో బాపిరాజుగారు భిన్నులు కారు. జీవితంలో ఒకే కళారంగంలో రాణించే వారికే ఇటువంటి వ్యావహారిక, రసాత్మక సమన్వయ లోపం సహజంగా వుంటున్నపుడు ఒకటి కంటే మించిన కళల్లో దక్షులైన అడవి బాపిరాజుగారి లాంటి వారిలో అస్థిరత కొంత ఎక్కువ వుండటం అసహజమేమీ కాదు. అయినా, అటువంటి స్థితి లేకుండా వుండటం వాంఛనీయం.

కళ కళ నిమిత్తమే అనే వాదానికి ఆయన దూరుడుకాదు. అదే విధంగా కళ సమాజం నిమిత్తం అనే వాదానికి కూడ దూరుడు కాదు. కారణం, కళ మానవ జీవితం నుంచే ఉద్భవించింది, సమాజం కూడ మానవ జీవితం నుంచే ఉద్భవించింది. రెంటి ఆశయం కూడ మానవునిలో ఆనంద దీపికను వెలిగించాలనే. మానవుడిలోని దుఃఖ తిమిరాన్ని పారదోలాలనే. కనుక సమాజం నిమిత్తం కళ అన్నా, కళ నిమిత్తం కళ అన్నా జీవితం నిమిత్తమే కళ అవుతుంది. అదే బాపిరాజుగారి కళాతత్త్వం.

ఏది ఏమైనా, బాపిరాజుగారు వ్యావహారిక జగత్తులో కంటే రస జగత్తులోనే ఎక్కువగా జీవించారు. చైనాలో ఒక లోకోక్తి వుంది - "నీ చేతిలో రెండు రొట్టెలు వుంటే ఒక దాన్ని అమ్మి తామర పూవును కొనుక్కో" అని. బాపిరాజుగారి చేతులో రెండు రొట్టెలు వుంటే ఆయన ఆ రెండు రొట్టెలను కూడా అమ్మి రెండు తామర పూవులను కొంటాడు. ఇదీ ఆయన కళాతృష్ణ!

(విజయవాడ ఆకాశవాణి సౌజన్యంతో)

# ప్రస్తావన

## శ్రీమతి ఐరావతీ కార్వే

ఈ వ్యాస సంకలనంలోని రెండవ వ్యాసం 'గాంధారి' జూలై 1962 లో వ్రాయబడినది. ఆ సమయంలో మహాభారతంలోని వ్యక్తులను (పాత్రలను) గురించి నేను ఇంకా వ్యాసాలు వ్రాస్తాననే ఊహ కూడా కలుగలేదు. ఒకదాని తరువాత ఇంకొకటిగా అయిదు సంవత్సరాల్లో ఈ వ్యాసాలు వ్రాశాను ప్రతి వ్యాసం వ్రాస్తున్నప్పుడు దీని తరువాత యింకొకటి వ్రాస్తానని అనిపించేది కాదు. ఈ రకాలయిన వ్యాసాలు యీ పుస్తకంతో ముగిసినట్లు కూడ చెప్పలేము. ప్రతి వ్యాసం వ్రాస్తున్నప్పుడు యిదే చివరి వ్యాసం అనిపించేది. దీని తర్వాత యేమైనా వ్రాస్తే చర్విత చర్వణమే అవుతుంది అందుచేత ఇంకా వ్రాసేది ఏమీ లేదు. ఆ భావం ఈ క్షణంలో కూడ వుంది. ఈ భావమే స్థిరంగా వుంటుంది. ఇక ముందు మహాభారతం గురించి ఏమీ వ్రాయలేనని ఈ నాడే ఏమీ చెప్పలేను నా మిత్రులు చాలామంది ఈ పుస్తకం వ్రాసిన కారణమేమని అడిగారు. ఈ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేను. మాట్లాడడంలోను, వ్రాయడంలోను నా మనస్సులో ఒకే భావం ఉంది. మన మనస్సులో తీవ్రమైన భావోద్వేగం కలిగినపుడు అది ఇతరులకు చెప్పాలని అనిపించడం సహజం. అది అణచివేసుకోవడానికి వీలులేని ప్రాథమిక (basic) ప్రవృత్తి. ఇది తప్ప వేరే ప్రవృత్తి మనస్సులో ఉందని నేను అనుకోవడం లేదు. నా వృత్తి ఉపాధ్యాయ వృత్తి. మనం చెప్పేది ఇతరుల మనస్సుకు బాగా హత్తుకు పోవాలనేదే నా భావం. అందుచేత చెప్పేది స్పష్టంగాను, సరళంగాను, సుబోధకంగాను ఉండాలనేది నా ముఖ్యోద్దేశ్యం. నేను వ్రాసింది చదివి, అర్థంచేసుకొని, దాంట్లో ఆక్షేపించదగిన తప్పులు ఉన్నాయని ఎవరైనా అంటే నేను బాధపడను. కాని నేను వ్రాసిన దాంట్లో అజాగ్రత్త మూలంగా నేను అనుకున్నది కాకుండా వేరే అర్థం వచ్చేటట్లయితే నేను బాధపడతాను. ఉదాహరణకు నా మిత్రుడొకడు 'ద్రౌపది' అనే వ్యాసం చివరి భాగంలో 'వచ్చే జన్మలో నీవు అన్న కావాలి' అనే వాక్యానికి 'నీవు వచ్చే జన్మలో నాకు (ద్రౌపదికి) అన్న కావలసింది' అనే అర్థాన్ని గ్రహించాడు. ఈ తప్పు నాకు చాలా బాధ కలిగించింది. నా భావం ప్రకారం ద్రౌపది ఐదుగురు పతులతో పతివ్రత భావంతో ప్రవర్తించే స్త్రీ. అదీగాక ఒక పురుషునికి భార్యగా వుండి, ఒక పుత్రుణ్ణి కని, ఆ పురుషుణ్ణే వచ్చే జన్మలో నాకు అన్న కావలసిందని కోరడం నాకు చాలా అస్వాభావికంగాను, డాంబికంగాను, అన్ని విధాల అసంభవంగాను అనిపిస్తుంది. ఈ ముద్రణలో నా ఆశయాన్ని స్పష్టం చేయడానికి 'వచ్చే జన్మలో ఐదుగురు అన్నలలో పెద్ద వాడివి కావలసిందని కోరినట్లు' మార్పు చేశాను. నా ఆశయానికి తప్పుడు అర్థము కలిగించేది ఇందులో ఇంకా ఏమీ ఉండదని నేను ఆశిస్తున్నాను.

భండార్కర్ ఇన్స్టిట్యూట్ వారు పరిష్కరించి ప్రచురించిన మహాభారత ప్రతినే నేను ఆధారంగా గ్రహించాను. అందుచేత మన మనస్సుల్లో మహాభారతం గురించి ఉన్న కొన్ని విషయాలు వదిలిపెట్టివేయబడినట్లు తోస్తుంది. వ్యాసాల్లో అక్కడక్కడ ఈ విషయాలను ఉటంకించాను. ఇదీగాక ఈ ముద్రణలో తర్వాత కాలంలో జొప్పించబడిన అనేక విషయాలు ఉన్నాయి. దానికి కారణం భండార్కర్ వారి ప్రస్తుత ప్రతి వ్రాత ప్రతు లన్నింటిని బాగా పరిశీలించి, ప్రాచీనతమమయిన వ్రాత ప్రతులమీద ఆధారపడి తయారుచేయబడింది. పాతవ్రాత ప్రతుల్లో అసలే లేనటువంటి కాని

యితర వ్రాత ప్రతుల్లో కొన్నింటిలో ఉన్నవీ, కొన్నింటిల్లో సంక్షేపంగా ఉన్నవీ అయిన అంశాలు ఈ క్రొత్త ప్రతిలో తీసివేయబడినవి ఈ క్రొత్త ప్రతి సంపాదకులకు లభించిన ప్రాచీనతమ ప్రతులమీద ఆధారపడి ఉన్నది ఈ ప్రతి క్రీ శ 8-9 శతాబ్దాలకంటే పాతది కాదు. ఈ ప్రతి ముందు ముందు పరిశోధనకు, అధ్యయనానికి ఆధారం అవుతుంది ఇప్పటిదాకా జరిగిన పరిశోధన చాలామటుకు గ్రంథం బాహ్యారూపం మీదే ఆధారపడి ఉంది నిజానికి ఇప్పుడు తయారైన ప్రతిలో తరువాత జొప్పింపబడిన, కథకు ఏ మాత్రం సంబంధం లేనిది చాలా భాగమున్నది. క్షుణ్ణంగా అధ్యయనం చేసి దాన్ని తీసివేయవలసిన అవసరమున్నది అలా జరిగితే కొన్ని సంవత్సరముల తరువాత భండార్కర్ ప్రతిలో ప్రస్తుతం ఉన్నదానిలో సగానికి పైగా తీసివేయబడుతుంది. బహుశః యింకో సంశోధితప్రతి (revised edition) తయారయ్యే అవకాశమున్నది. ఇంతటితో ఈ పని ముగిసిపోదు. అంతకు మించి మహాభారత మూలంలో ఉన్న 'జయ' అనే గాథ గుర్తించబడడానికి అవకాశాలున్నాయి. పరిశోధన జరుగుతూంటే ఇంకా పరిశోధనకు కొత్త మార్గాలు లభిస్తూ ఉంటాయి పాతతరం వారి పరిశోధనలోని తప్పులు తెలుస్తాయి. అందుకని ఏదైనా పరిశోధనా కార్యం జరిగితే ఆ రంగంలో అదే తుది మాట అని చెప్పలేము.

సంస్కృతం నా అధ్యయన విషయం కాదు నేను మహాభారతం కేవలం కుతూహలంతోనే చదువుతాను. ఏ భాగం నాకు ప్రక్షిప్తం అని తోచిందో, లేక తరువాత జోడించబడిందని తోచిందో దానిని తరచుగా ఉటంకించాను. గ్రంథం చదువుతూ ఉండగా నాకు అటువంటి భావం కలిగింది. దాని వెనకాల గంభీర పరిశోధనా భావం లేదు, కాని పరిశోధనవలన అది ప్రక్షిప్తము కాదని తేలితే అంతవరకు (ఆ భాగంలో) నా వివరణ తప్పు అయి ఉండవచ్చు. లేక నా వివేచన తప్పు కాకపోయినా మీకు నచ్చలేదని తప్పకుండా అనవచ్చును. మహాభారతం ఒక పెద్ద నిధి. దానిలోనించి ఏదైనా వెలికితీయాలంటే రక రకాలుగా తీయవచ్చును. ఒకరు వ్రాసిన దాంట్లో అంతా వచ్చివేసిందని, వచ్చివేసి ఉండాలని చెప్పడానికి వీలులేదు. ప్రతివారు తమ శక్త్యనుసారంగా ఈ సంస్కృతి భండాగారం నుండి ద్రవ్యాలను (విషయాలను) ఉపయోగిస్తూ ఉంటారు. జ్యోతిష్యం, భాషాశాస్త్రం, పురాతత్త్వశాస్త్రం తెలిసిన వారు మహాభారత పాత్రలను గురించి రకరకాలుగా వ్రాయగలరు. నేను నా శక్తిని బట్టి, నా అభిరుచిని బట్టి - కేవలం కొన్ని విషయాలను ఉటంకించడం జరిగింది. (ఉదా:- ఆజ్య మనగా ఏమిటి? ఘృత మనగా ఏమిటి ?) కాని వాటిని గురించి నేను ఎక్కువగా పరిశోధన చేయలేదు. నేను ఈ వ్యాసాలు వ్రాయడానికి నా తరువాత ఎవరైనా యువ పరిశోధకుడు ఈ విషయాలను గురించి గంభీరంగా పరిశీలించి, నేను చెప్పిన దాంట్లో ఉన్న లోపాలను పూరిస్తాడనే ఆశే మూలకారణం.

'గాంధారి' వ్యాసం ప్రచురించబడిన తరువాత ఒక తరుణ భారతీయ మిత్రుడు 'ఈ గాంధారి ఎవరమ్మా ?' అని అడిగాడు. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. మనం ఈ యుగంలో వ్యర్థులమనీ, వ్యర్థంగా భూతకాలంలో విహరిస్తుంటామని, పనికిరాని పాత సామగ్రిలాంటి వారమనీ అనిపించింది. ఇకముందు వ్రాయకూడదన్న ఆవేశం కలిగింది. ఇంగ్లీషు ప్రతిలో ఉన్నట్టుగా మహాభారత కథ అంతా భూమికలో వ్రాద్దామని కూడ అనిపించింది. కాని ఈ రెండు ఆలోచనలను తరువాత వదలి పెట్టేశాను. నేను చాలా మొండిదాన్ని. యువతరంవారు తమ మాటలను నామీద రుద్దాలని చాలా ప్రయత్నం చేస్తూ ఉంటారు. నా ముగ్గురు ఆత్యాధునికులయిన పిల్లలూ, నా Ph D. విద్యార్థులూ నన్ను ఎదిరిస్తూ ఉంటారు. నేను సమాధానం చెబుతూ ఉంటాను. నా విషయాలను ఈ

యువతరానికి అందించడానికే ఈ నా ప్రయత్నం. నా వివేచన తప్పనుకొని, ఈ తరంవారు మహాభారతం చదివారంటే అది నా విజయం అని నేను తలుస్తాను.

## 2

మహాభారత పరిష్కృత ప్రతి అంటే ఏమిటి ? పరిష్కారం ఏమి జరిగింది? 50 సంవత్సరాలపాటు శ్రమించి ప్రచురించబడిన ఈ ముద్రణ ఆధారంగా నా వ్యాసాలు వ్రాయబడినవని నేను అంటున్నాను కదా! కాని అందులో ఏ భాగం తరువాత వచ్చి ప్రవేశించిందో, అందులో ఏది ప్రక్షిప్తాంశమో నేను ఎలా చెప్పగలను ? ఈ రకమయిన ప్రశ్నలు ఉంటూనే ఉంటాయి. ఈ నీరస చారిత్రక విషయాలను గురించి నేను వ్రాయదలచుకో లేదు, కాని చాలా మంది మిత్రులు ఈ ప్రశ్నలు అడుగుతూ ఉండడంతో వ్రాయవలసి వస్తున్నది. మొదటినుంచి ఈ విషయాలు ఎరిగి ఉన్నవారూ, సుక్తంకరు గారి అసలు వ్యాసాన్ని చదివినవారూ ఈ వ్యాసాలవల్ల గ్రహించ గల విషయాలు ఏమీ ఉండవు. అలాగే ఎవరైతే చరిత్రను గురించి తలబ్రద్దలు కొట్టుకొనదలుచుకోరో వారు ఈ నా వ్యాసాలు చాలా తేలికగా తీసుకుంటారు. కాని చాలామందికి జిజ్ఞాస ఎక్కువ. నా భూమిక ఏమిటి అని తెలుసుకోవడానికి సహాయపడుతుంది అని వారు ఈ వ్యాసం చదువుతారు. అందుచేత అంతగా ఇష్టంలేకపోయినా ఈ వివరణం వ్రాస్తున్నాను.

ఏ పుస్తకం ఆధారంగా శాస్త్రీయ సంపాదన జరిగిందో, అది పాతది అయి ఉండాలి. కొన్ని వందేండ్లవయితే,కొన్ని శతాబ్దాలనాటివి, కొన్ని వేల ఏండ్ల నాటివి. వాటి రచయిత (ఒకరో, పెక్కురో) జీవించిలేరు. మరి వాటికి ఎన్నో ప్రతులు ప్రచారంలో ఉంటాయి. అనేక పర్యాయాలు ఆ గ్రంధాలు ఎన్నో భాషల్లో వెలుస్తాయి. ఇటువంటి సమయంలో దొరుకుతున్న ప్రతులన్నింటిని పరిశీలించి అన్నింటికన్నా ప్రాచీనమైనదీ, సాధ్యపడితే రచయిత జీవిత కాలంలోనే వ్రాయబడినదీ అయిన ప్రతిని సంకలనం చేసే ప్రయత్నమే ఒక రకంగా దాని సంశోధిత ప్రతి అనబడుతుంది. ఇంకోరకమయిన సంశోధిత ప్రతి కూడా ఉంది. అది ముందు చెప్పబడింది. బైబులుకు ఇటువంటి ప్రతులు వెలువడుతూ ఉన్నాయి. ఏదైనా కొత్త పరిశోధన జరుగగానే లోగడ ప్రచురించబడిన ప్రతిమీద దాని ప్రభావం పడుతుంది, అనగా ఏదో ఒక సంశోధిత ప్రతి ప్రచురించబడగానే, దానితో అంతిమ సంశోధన జరిగిందని చెప్పడానికి వీలులేదు. ఏదో ఒక సమయంలో లభించిన ఆధారాలను బట్టి ఆ ప్రతి ప్రచురించబడిందని చెప్పాలి. మహాభారత సంపాదకుల వాదన కూడా ఇదే. భారతదేశంలోనే కాదు, భారతదేశానికి బయట చైనా, టిబెట్టు, బర్మా మొదలయిన దేశాలలో మహాభారత వ్రాత ప్రతులు ఒకటో, అరో లభించినట్లయితే వాటిని సంపాదించి, వాటి ఆధారంగా, లేకపోతే, వాటి పూర్వకాలపు వ్రాత ప్రతులు ఆధారంగా సంపాదకులు సంపాదకత్వం చేయాలి.

మహాభారత సంపాదకత్వంలో వెయ్యికి పైగా ప్రతులు సరిచూడ బడ్డాయి. కొన్ని వ్రాత ప్రతులకు సంపూర్ణ మహాభారతంతో సంబంధం ఉంటే, కొన్నింటికి కొన్ని పర్వాలతో మాత్రమే సంబంధ మున్నది. అన్ని ప్రతులకు సమానమైన ప్రాధాన్యం లేదు. వాటిల్లో ఏవి ప్రాధాన్యం కలవిగా ఎంచబడినవో, ఆ ప్రతులను చాలా నిశితంగా పరిశీలించారు. సంశోధిత ప్రతిలో ప్రతి పదాన్ని ఇతర ప్రతులలోని శబ్దాలతో పోల్చి చూశారు. ఈ పని ఎంత కష్టసాధ్యమూ, క్లిష్టమూ అయినదో తెలియపరచడానికే ఈ మాటలు

మహాభారత ప్రతులన్నింటిని సేకరించిన తరవాత ఈ విభిన్న ప్రతుల వర్గీకరణ వాటిలో భేదాన్ని సుక్తంకరు మహాశయుడు నిరూపించాడు. లభిస్తున్న ప్రతులను ప్రధానంగా 'ఉత్తర

ప్రాంతపువి', 'దక్షిణ ప్రాంతపువి' అన్న శాఖలుగా విభజించినట్లు కనిపిస్తున్నది. ఉత్తర ప్రాంతపు ప్రతులలో పరస్పరం సామ్యం కల విషయాలు ఎన్నో ఉన్నాయి. అదే విధంగా దక్షిణ ప్రాంతపు ప్రతులలో కూడ సామ్యం ఉన్నది. ఉత్తర ప్రాంతపు ప్రతులను మళ్ళీ రెండు భాగాలు చేయవచ్చు. మొదటిది శారదా లిపిలో వ్రాయబడినది. కాశ్మీరులో అది భూర్జపత్రం మీద వ్రాయబడింది. ఆ వ్రాతప్రతిమీద, లేక అటువంటి ప్రతులమీద ఆధారపడి తయారైన ఇతర ప్రతులు. ఈ సమూహానికి 'K' అని పేరు. రెండవ భాగంలో రెండు ఉపశాఖలు. మొదటి దానిలో మైధిలీ, బెంగాలీ, నేపాలీ లిపులలో వ్రాయబడిన గ్రంధాలు, రెండవ శాఖలో దేవనాగరి లిపిలో వ్రాయబడిన గ్రంధాలు. దక్షిణప్రాంతపు గ్రంధాలలో కూడ రెండు శాఖ లున్నాయి. ఒక శాఖలో తెలుగు, గ్రంధలిపులలో వ్రాయబడినవీ, రెండవ శాఖలో మలయాళీ లిపిలో వ్రాయబడిన గ్రంధాలు. ఈ గ్రంధాలలో ఒకదానితో ఒకదానికి, మూల మహాభారతానికి గల సంబంధాన్ని ఈ క్రింది విధంగా సుక్తంగారు చూపించారు:




ప్రస్తుతం లభిస్తున్న ప్రతు లన్నీ క్రింది తరగతికి చెందినవి. పై తరగతికి చెందిన ప్రతులు ఏమయినవన్న విషయాన్ని గురించి జైమిని దుర్యోధనుని పక్షం వహించి ఇలా వ్రాసి ఉంటాడని ఒక తర్కం ఉంది (అశ్వమేధ పర్వానికి ప్రొ, కర్మార్కర్ వ్రాసిన పీఠిక చూడండి). ముగ్గురూ వ్రాసి ఉంటే

వారు వ్రాసిన అసలు వ్రాత ప్రతులు ఏవీ లభ్యం కావడంలేదు. మన ముందున్న కథను వైశంపాయనుడు అర్జునుడి మునిమనుమడు జనమేజయునికి చెప్పాడు. అది మొదటి దానికి పెంచబడిన ఆవృత్తి మాత్రమే. ఎందుకంటే ఈ కథ ఉగ్రశ్రవుడు లోమహర్షణుడు నైమిశారణ్యంలో కులపతి శౌనకునికి చెప్పినదే. వ్యాస భారతము, వైశంపాయన భారతం, లోమహర్షణుడు వైశంపాయనునికి చెప్పిన మూల భారతం - ఈ విధంగా ఒక క్రమం కల్పించబడింది. ఈ మూల భారతానికి ఒక శాఖ ఉత్తరప్రాంతంలో ఉన్న వ్రాతప్రతుల్లో ఉండిపోతే, మరోశాఖ దక్షిణ ప్రాంతంలోని వ్రాత ప్రతుల్లో ఉన్నది. ఉత్తర ప్రాంతాల్లోని ప్రతుల నుండి వాయవ్యప్రాంతపు ఒక ప్రతి వెలువడింది (దీనిని సుక్తంకరు V-న్యూ' అనే గ్రీకు అక్షరంతో సూచించారు). దాని నుండి శారదా, దేవనాగరి లిపులలో వ్రాయబడి, శారదా లిపిమీద ఆధారపడిన ప్రతులు వెలువడ్డాయి గంగానదీ లోయలో (y-గామా అనే గ్రీకు అక్షరం) ఇంకో version ఉన్నది. దానికి తూర్పు ప్రాంతంలోని భాషలలో (e-ఎప్సిలాన్ అనే గ్రీకు అక్షరం) నేపాలి, మైధిలి, బెంగాలీలలో మహాభారతం వ్రాయబడింది. ఈ మహాభారతా లన్నింటిలో శారదా, మరియు K ప్రతులు అన్నింటి కంటె ఎక్కువగా ఉన్నాయి గంగానదీ లోయలో వెలువడిన ఆ ప్రతుల్లో బాగా ఎక్కువగా దేవనాగరి ప్రతులు వెలువడ్డాయి. వీటిలో శ్లోక సంఖ్య చాలా యెక్కువ. ఉత్తర, దక్షిణ, పూర్వశాఖల్లోని ప్రతులన్నింటి నుండి తీసుకొనబడిన భాగాలు ఉన్నాయి. దక్షిణ ప్రాంతంలోని మూలగ్రంధం నుండి ఎక్కువ భాగం గల σ సిగ్మా అనే గ్రీకు అక్షరం పేరుగల ప్రతులు బయలుదేరాయి. వీటినుంచే గ్రంధలిపి, తెలుగు లిపుల ప్రతులు వెలువడ్డాయి. దక్షిణ ప్రాంతపు మూల గ్రంధంలో కొత్త భాగాలు కలుప నటువంటి ప్రతి మలయాళీ భాషలో గల ప్రతి.

ఈ గ్రంధాలలో చాలా వాటిమీద కాల నిర్దేశకాలయిన సూచనలు లేవు దేనిమీద అయితే కాల నిర్దేశం ఉందో, వాటి అన్నింటిలోకి ప్రాచీన గ్రంధం నేపాలీ ప్రతి. అది సుమారు క్రీ.శ. 1200 నాటిది. అన్నింటిలోకి అర్వాచీనమయిన గ్రంధం క్రీ. శ. 1842 మధ్యలో వ్రాయబడింది. అన్ని విషయాలకు ఆధారభూతంగా గ్రహించబడినది. బొంబాయిలో ముద్రించబడి, అక్కడి వ్రాత ప్రతులమీద ఆధారపడి, దేవనాగరి ప్రతులలో కల వ్యర్థ విషయాలతో కూడుకొన్నది ఆ ప్రతి. కాని ఆ గ్రంధం ముద్రించబడింది కనుక విదేశంలోనూ, ఇక్కడి వారికి అందరికీ దాన్ని గురించి తెలిసింది. దానిలో ఏం తీసివేయబడింది, ఏం మిగిలిపోయింది అన్నది ఇక్కడి - అక్కడి విద్వాంసులు పరీక్షించి తెలుసుకోవడానికి సాధ్యమయింది. సర్వవిదితమయిన ఈ ప్రతి The Vulgate అన్న పేరుతో అన్ని చోట్ల ఉటంకించబడింది. (vulgate) ఎల్లప్పుడు ప్రచారంలో ఉండి అందరికి తెలిసినటువంటి ప్రతి. ఈ శబ్దం ఇటాలియను, లాటిను భాషలలో ఉన్న బైబిలు ప్రతికి వాడుకున్నారు–ఆక్స్‌ఫర్డు నిఘంటువు,)

(ఈ రక రకాలయిన వ్రాతప్రతులను చూస్తే శారదా ప్రతి అన్నింటి కంటే తక్కువ శ్లోకాలు గల మహాభారతం అని తెలుస్తుంది. K యొక్క చాలా ప్రతులు కూడ దానితో పోలి ఉన్నవి. నేపాలిలో ప్రాచీన ప్రతి కూడ దానితో సరిపోలి ఉన్నది. ఇంతేకాదు, దక్షిణ ప్రాంతపు మలయాళీ ప్రతిలోని చాలా విషయాలు 'శారదా' తో పోలి ఉన్నవి. అనగా ఎప్పుడో పూర్వకాలంలో దక్షిణప్రాంతానికి ఏ ప్రతి అయితే వెళ్ళిందో, ఏది ఆధారంగా తరువాత మలయాళీప్రతి వెలువడిందో అది ఉత్తర ప్రాంతపు ప్రతికంటే చాలా భిన్నమయినది. అందులో అనేక అంశాలు చేర్చబడి మైధిలీ మొదలయిన ప్రతులు వెలువడ్డాయి. మరియు నిరంతరం పూరించబడి చివరకు దేవనాగరీ ప్రతులలో వెలువడిన

మూల మహాభారతానికి 'శత సాహస్రి' అనే పేరు కలిగింది ప్రతి సమూహంలో ఏవో కొన్ని విశేషాలున్నాయి ఉత్తర ప్రాంతపు ప్రతులలో లేనటువంటిది, గ్రంథలిపిలోను, తెలుగులోను గల ఒక విశేషమున్నది అది ఏమిటంటే ఒక విశిష్టమయిన శీలత ఉత్తరప్రాంత ప్రతులలో దుష్యంతుడికి శకుంతలకు, యయాతికి శర్మిష్టకు వివాహం కాలేదన్న విషయం స్పష్టం. దక్షిణ ప్రాంతపు ప్రతులలో వారి వివాహ సంరంభమూ, బ్రాహ్మణులకు ఇవ్వబడిన దానదక్షిణలూ వర్ణించబడినాయి. ఇంతేకాదు, సత్యవతికీ పరాశరుడికీ పరమ ఆడంబరంగా వివాహం జరిపించబడింది దేవనాగరి లిపిలో ఉండి, శారదా, K మరియు నేపాలీ మున్నగు ప్రతులలో లేనటువంటి ప్రసంగాలు కణికనీతి, దూర్వాసుడు వేలకొద్ది శిష్యులతో సహా అరణ్యానికి వెళ్ళి పాండవులను భోజనం పెట్టమని కోరడం, ద్రౌపది మొర, శ్రీకృష్ణవస్త్ర ప్రదానం మొదలగునవి ఇవే కాక చిన్న చిన్న ప్రసంగాలు ఎన్నో ఉన్నాయి అన్నింటికన్నా పెద్ద గ్రంథం శత సహస్రం కాదు. కాని 95,586 శ్లోకాలు ఉన్నాయి దాని సంశోధిత ప్రతిలో 89,136 శ్లోకాలే చివరికి మిగిలాయి

ప్రత్యక్షంగా మహాభారత వ్రాత ప్రతుల్లో లభించిన ఆధారాలే గాక ఇతరత్రా లభించే ఆధారాలు కూడా ఉపయోగించ బడుతాయి. మహాభారతాన్ని సంక్షిప్తీకరించి వ్రాయబడింది 'భారత మంజరి' అనే పేరుగల గ్రంథం దాన్ని క్షేమేంద్రుడు సుమారు క్రీ. శ. 1100-1200 మధ్య వ్రాశాడు. అక్కడ ఒక్కొక్క శ్లోకాన్ని పరిశీలిస్తూ పోతూంటే, ఇటువంటి గ్రంథాల ఉపయోగం పరిమితం అని తేలుతుంది కాని కొన్ని విషయాలు ఉపయుక్తంగా కనిపించినవి. క్షేమేంద్రుడు మహాభారతంలోని ఆఖ్యానాల పట్టిక ఇచ్చాడు. అందులో కూడ 'కణిక నీతి' అన్న ప్రకరణం లేదు. కొన్ని శ్లోకాలు లేకపోయినా ఊహించుకోవాలి. వ్యాసుడు తన ఐదుగురు శిష్యులకు భారతం వినిపించాడు. అదే పాండవుల 'జయగాధ'. అది 'జయ' మనే కావ్యమయి ఉంటుందని ఊహ. ఐదుగురు శిష్యులు కధ విన్నారు. ప్రతివాడు తన ఇష్టానుసారం, తన కళానైపుణ్యానుసారం ఆ కధను వివరించాడు. అలా లేకపోతే, వాటిని గురించి ఊహించడానికి వీలుపడేదికాదు కాని ఏప్రకరణాన్ని గురించి టీక (వ్యాఖ్య) వ్రాయబడిందో, ఆ ప్రకరణాలన్నీ లేక పోయినట్లయితే, శారదాది గ్రంథాల (దురదృష్టవశాత్తు వాటి సమయం తెలియదు) ప్రాచీనత్వానికి ఆధారం లభిస్తుంది.

ఆంధ్రదేశంలో వాదిరాజు (?) అనే పేరుగల కవి దాదాపు ఇదే సమయంలో తెలుగు భాషలో మహాభారతానికి అనువాదం - ఒక్క శ్లోకం కూడ విడిచిపెట్టకుండా చేశాడు. ఆ అనువాదాన్ని పరిశీలించినపుడు వాది రాజు ముందు ఏప్రతి ఉండి ఉండాలి అన్న విషయాన్ని కూడ పరిశీలించారు.

మహాభారత గ్రంథం దాదాపు 1500 నాటికి జావాకు వెళ్ళింది.అక్కడ ఆ భాషలో దానికి అనువాదం వెలువడింది. మధ్యమధ్యలో మూల సంస్కృత శ్లోకాలు, లేక శ్లోక భాగాలు - తప్పుడు విధానంలోనే- ఉటంకించబడినవి. ఆ ఉద్ధరణను తులనాత్మకంగా పరిశీలించడం చాలా ఉపయోగపడ్డది. చాలాసార్లు ప్రాచీన సంస్కృత శబ్దాలు సరిగా తెలియక కొత్త శబ్దాలుగా దేవనాగరీ ప్రతులలో వాడబడినవి. జావా ప్రతిలో ప్రాచీన సంస్కృత శబ్దాలు లభిస్తున్నవి.

ఈ మూడు గ్రంథాలే కాక మహాభారతంపైన టీకాకారుల వ్యాఖ్యలు కూడ చాలా ఉపయోగకరమైనవి. ఆ టీకా కారులు ఈ క్రిందివారు: (1) దేవబోధ, (2) విమలబోధ, (3) సర్వజ్ఞ నారాయణ, (4) అర్జున మిశ్ర, (5) నీలకంఠ.

దేవబోధుని టీక 'జ్ఞాన దీపిక' అన్న పేరు గలది. దేవబోధుడు సుమారు క్రీ. శ. 1000-1100 మధ్య ఉండి ఉంటాడు. అందరిలోకీ ప్రాచీనుడు, అలాగే అందరిలోకీ అతి గొప్ప విద్వాంసుడు కావడంచేత

అతని వ్యాఖ్య చాలా ఉపయోగపడ్డది. విమలబోధుని వ్యాఖ్య 'దుర్ఘటార్థ ప్రకాశిని' లేక 'విషమ శ్లోకి' అన్న పేరు గలది. కాలం సరిగా తెలియదు. సర్వజ్ఞ నారాయణుని వ్యాఖ్య 'భారతార్థ ప్రకాశ' మనే పేరు గలది. కాలం దాదాపు క్రీ. శ. 1100. అర్జున మిశ్రుడి వ్యాఖ్యకు 'భారత భావదీప' మని పేరు. దాని కాలం దాదాపు క్రీ. శ. 1400. నీలకంఠుని వ్యాఖ్యకు 'భారత భావదీప' మని పేరు. దాని కాలం సుమారు క్రీ. శ. 1700. దీనిని గురించి పరిచయం అన్నింటి కన్నా ఎక్కువ. అతను గోదావరీ తీరంలో కోపర గ్రామ నివాసి. బ్రాహ్మణుడు. తండ్రి గోవింద సూరి. తల్లి పుల్లాంబిక. దేవబోధుని వ్యాఖ్యలో చాలా భాగాలు లేవు. అవి 'శారదా' ప్రతిలో కూడ లేవు. అనగా దేవబోధుని వ్యాఖ్య, శారదా ప్రతి ఒకదాని కొకటి పూరకాలు. అదేకాక, అర్వాచీన ప్రతులలో వచ్చే క్రొత్త శబ్దాలు వాటిలో లేవు. 'శారదా' లో వచ్చిన ప్రాచీన శబ్దాలు ఉన్నాయి. అర్థాలు కూడా సమగ్రంగా చక్కగా చెప్పబడి ఉన్నయి. పైన చెప్పిన వారే కాక ఇంకా చాలా మంది వ్యాఖ్యాతలు కూడా ఉన్నారు.

మహాభారత వ్రాతప్రతులు. పైన చెప్పబడిన వ్యాఖ్యాతలు మొదలయినవారు ఇచ్చిపోయిన ఈ సాధన సామగ్రి కాకుండా మహాభారత శ్లోకాలు, ఆఖ్యానాలు ఇంకెక్కడయినా వచ్చి ఉంటే వాటిని ఉపయోగించుకోవడం జరిగింది. ఉదాహరణకు భీష్మపర్వ సంవాదతత్త్వము విచారిస్తూ ప్రొ. బేల్వల్కర్ నిరూపించినట్లుగా ప్రస్తుతం మనం ఎరిగి ఉన్న భగవద్గీతయే శంకరాచార్యులవారు భాష్యం వ్రాస్తున్నప్పుడు వారి సమక్షంలో ఉంది.

ఇదంతా చెప్పడం యెందుకంటే ప్రస్తుతం సంకలితమయిన ప్రతి ప్రాచీనతమమని మనకు తెలిసిన వ్రాత ప్రతిని పరీక్షించిన తరవాతనే స్థిరం చేయబడ్డది. ఈ వ్రాత ప్రతి సుమారు క్రీ. శ. 1000 నాటిది. అనగా మహాభారత కథ క్రీ. పూ. 1000 లో జరిగిందని అనుకుంటే అది జరిగిన 2000 సంవత్సరముల తరువాతది ఈ పుస్తకం - నేడు మన ముందున్న ప్రతి. దాంట్లో ప్రత్యక్షంగా ప్రక్షిప్తాంశాలు ఉన్నప్పటికీ, అన్నింటికన్నా ప్రాచీనమయిన ప్రతులలో - ముఖ్యంగా దేశానికి రెండు కొసల్లో ఉన్న శారదా మలయాళీ ప్రతులలో - ఉండడంచేత వాటిని యథాతథంగా తీసుకోవడం జరిగింది. స్వయంగా సంపాదకులు అక్కడక్కడా దీన్ని చూపించారు. కాని వారి ముందు ఉన్న పని ఏ ప్రతి ప్రాచీనమయిన దని పరిశీలించడం. దానివలన వారు పరస్పరం విరుద్ధంగా ఉన్న విషయాలలో ఐక్యం కల్పించుకోవడం జరిగింది. ప్రాచీన సౌత వాఙ్మయం బ్రాహ్మణుల చేత బడిన తరువాత అధ్యాయాలకు అధ్యాయాలూ, భృగు కథలూ వాటిలో ప్రవేశపెట్టబడినవి. వాటిలో కృష్ణుడు ముఖ్యదేవత. భాగవత ధర్మం ప్రచారానికి వచ్చిన మీదట కృష్ణుని అతిమానుషత్వమూ, దైవత్వ కథలూ, అవాస్తవిక స్తుతులు అందులో వచ్చి చేరినవి. ప్రస్తుత మున్న ప్రతులలో మహాభారత కథ రెండు విధాలుగా ప్రారంభించబడింది. ఇటువంటివి ఒకటీ - రెండూ కాదు. అనేక కథలను స్వయంగా సుక్తంకరూ, ఇతర సంపాదకులూ అక్కడక్కడా చూపించే ఉన్నారు. వీటన్నింటిని లెక్కలోకి తీసుకొని చాలామటుకు నేను ఫలానాది ప్రక్షిప్తంకాదనీ ఫలానాది తరువాత చేర్చబడిందనీ చెప్పాను. కొన్ని కొన్ని చోట్ల నా బుద్ధిని ఉపయోగించి కూడా చెప్పాను.

సంశోధిత ప్రతి వ్యాఖ్యాయుత మయినది కాదు. అది ఏమిటి? దాని పరిధి ఏమిటి? అన్న విషయం తెలిసే ఉంటుంది. ఈ ప్రతి మన చేతిలోకి వచ్చింది. ఇప్పుడు దానిని ముందుగా పరిశీలించి, ఆ పరిశోధనలో ప్రత్యక్షంగా కనబడుతున్న ప్రక్షిప్తాంశాలను పూర్తిగా తీసివేస్తే, రెండవ సంశోధితప్రతి తయారవుతుంది. ఆ తరువాత మళ్ళీ గంభీరంగా పరిశీలన చేయవచ్చును. క్రమక్రమంగా, ఒక్కొక్క అంశంగా, విశిష్ట తత్త్వములతో మహాభారత రంగంలో ఉన్న పరిశోధకు

లందరి సహకారంతో ఇటువంటి అధ్యయనం జరగాలి. ఇటువంటి పని తత్త్వత: సౌందర్య పరిశోధనలో లేదు. కాని సౌందర్యానుశీలన, ఆనందప్రాప్తి ఈ రెండు కార్యాల మూలఫలంగా జ్ఞానం లభిస్తుంది. అది కేవలము సారస్వత పరిశోధన కాదు. అది మన సాంస్కృతిక మూలానికి సంబంధించినది. మూలం ఏమిటి? ప్రక్షిప్తాంశా లేమిటి? అవి ఎలా వచ్చినవి? అన్న ప్రశ్నలన్నీ ప్రాధాన్యం కలవే. ఈ పరిశోధన జరుగుతూ ఉండగా ఇతర సాంస్కృతిక చరిత్రను గుర్తెరగడం జరుగగలదు: అర్థం చేసుకోవడంలో సహాయం లభించగలదు. మహాభారతాధ్యయనం వలన మన ప్రాచీన కుటుంబ వ్యవస్థ, రాజకీయ విధానం, ధార్మిక ఆచార వ్యవహారాలు ఎలా ఉండేవో తెలుసుకోవడంతో సాంస్కృతిక చరిత్రలో ఒక భాగం తెలుస్తుంది. దానికి అనుషంగికంగా ఇతర ప్రశ్నలు వెలికి వస్తాయి. సుక్తంకరు తన వ్యాసంలో ఇలా వ్రాశారు శారదా ప్రతిలోను, దక్షిణప్రాంతపు మలయాళీ ప్రతిలోను పలుచోట్ల అద్భుతమైన సామ్యం కనిపిస్తున్నది. దానికి రెండు కారణాలు ఉండి ఉండవచ్చును.

1. పూర్వం మహాభారత కథ దక్షిణానికి చేరుకున్నపుడు ఉత్తరంలో ప్రచారంలో ఉన్న ప్రతులకును, దక్షిణంలో వచ్చిన ప్రతికిని ఎక్కువ భేదం ఉండకపోవచ్చు. మలయాళం అనగా కేరళ దేశ ప్రాంతంలో ఒక భాగం. అక్కడ ప్రక్షిప్తాంశాలు లేవు. దానికి వ్యతిరేకంగా ఆంధ్రప్రదేశంలో, ఇతర ప్రాంతాల వలెనే ప్రక్షిప్తాంశాలు బాగా నిండిపోయినవి.

2. ఈ కారణాలు కాకపోతే ఇంకో కారణం ఉండవచ్చు. పశ్చిమ ప్రాంతం నుండి సముద్రతీరం నుండి క్రిందికి వచ్చిన ఆర్య భాషీయులయిన బ్రాహ్మణులు పంచనదీ ప్రదేశంలో (పంజాబులోను, కాశ్మీరులోను) ఉండి ఉండవచ్చును. వారు తమతో పాటు కాశ్మీర ప్రాంతపు మహాభారత ప్రతిని తెచ్చి ఉండవచ్చును. అనగా భారతదేశంలో జన సమూహాల రాకపోకలను గురించిన పరిశోధనల వలన క్రొత్త విశేషాలు తెలియడం సంభవం కావచ్చు.

ఇంతమంది విద్వాంసులు 50 సంవత్సరాలపాటు తల ఎత్తకుండా పరిశ్రమించారు. అందువలన పరిశోధనకు ఒక అమూల్యమయిన సాధనం మనకు లభించింది.

– 14-1-1967

Buddhism and psychoanalysis tech us that the very ways in which we seek happiness actually block us from finding it. Our first mistake is in trying to wipe out all the sources of displeasure in our lives.

# ధరల దెప్పుడూ ఊర్ధ్వ దృష్టే

('మిసిమి' రచనల వర్క్‌షాపు)

'ధనమూలం ఇదం జగత్' అన్నారు. అంటే ధనం ఉంటే ఈ ప్రపంచంలో అన్నీ సాధించుకోవచ్చు నని. మరి పుష్కలంగా ధనం ఉన్నవారంతా సుఖంగా ఉన్నారా అంటే సందేహమే - ఉన్నారు అని ఖచ్చితంగా చెప్పడం సాధ్యం కాదు. నిజానికి ధనమున్నవాడే - మరీ ఎక్కువగా ఉన్నవాడు - ఎక్కువ సుఖం మాట అటుంచి, రకరకాల బాధలు, భయాలు, ఆందోళనలు నిస్పృహలు అనుభవిస్తున్నాడని, హంసతూలికా తల్పాలపై పడుకున్నా అతనికి సుఖంగా నిద్రకూడా పట్టదని మన అనుభవంలోని మాట. వీరంతా ధనవంతులే గాని సంపన్నులు కారు.

ధనం పెద్దగా లేకపోయినా, గంజి త్రాగి సుఖంగా చీకూచింతా లేకుండా, గుండె మీద చెయ్యి వేసుకొని, మేను వాల్చిన మరుక్షణమే వళ్లు మరిచి నిద్రపోగల అదృష్టవంతులు ఎందరో! వీరు ధనవంతులు కాకపోయినా సంపన్నులే! మానసికంగా అపారమైన సుఖ సంతోషాలు తృప్తిగా అనుభవించగల వారే!

మనుషుల మధ్య లావాదేవీలకు స్పష్టత కలిగించడానికి, వస్తువుల విలువలను నిర్ణయించుకోడానికి ద్రవ్య మానం రూపొందింది. ఎన్నో శతాబ్దాల క్రితం చలామణీలో ఉన్న వరహా, దినారా, పానా వంటి నాణేలు, ఇటీవలి కాలంలో డాలర్, పౌండు, రూపాయి, మార్క్, రూబుల్- ఇలా ఎన్నో- వీటన్నిటి ఉద్దేశ్యం ఇదే. దీని ఫలితంగా ద్రవ్య విధానం అంటూ ఒక ప్రత్యేక శాస్త్రమే రూపొందింది. మనిషి దగ్గర నాణేలు గుట్టలు పడుతుంటే ఆనందంతో తృప్తి కలుగుతున్నప్పటికీ, ధనవంతుడినన్న అహంకారం ఒక వైపు, ఆ ధనాన్ని కాపాడుకోవడానికి ఆందోళన మరో వైపు ఎక్కువవుతున్నాయి. అతనికి మనశ్శాంతి కరువవుతున్నది. ఈ లోహపు ముక్క (రాగి, వెండి, బంగారం ఏదయినా లోహమే గదా) యిస్తే ఎన్ని సరుకులు పొందగలనన్న ఆలోచనే అతని మనసును ఆక్రమిస్తున్నది. ఒకవైపు ఆ లోహపు ముక్కలను (ఇప్పుడు లోహం కాకుండా కేవలం కాగితం ముక్కలే సుమండీ) ఇతరులు దొంగిలించుకుపోకుండా కాపాడుకోటానికి తాపత్రయం. మరో వైపు ఈ నాణెం విలువ తగ్గిపోకుండా చూసుకొనే ఆందోళన. ఇతర వస్తువుల విలువలను ప్రమాణంగా ఉండటాని కని ఏర్పాటు చేసుకున్న 'ద్రవ్యం' విలువకే నిలుకడ లేక ముప్పు వాటిల్లుతున్నది.

ద్రవ్యం విలువ పడిపోతే, వస్తువుల ధరలు పెరుగుతాయి. ఆ నాటి నుండి నేటి వరకు ఇది జరుగుతూనే ఉన్నా, కొన్ని సందర్భాలలో ఈ పతనమయ్యే గతి శీఘ్రతరం కావడంతో అంతా అల్లకల్లోలం అవుతోంది. వస్తువుల ధరలు పెరగటం వేద కాలం నుండీ జరుగుతున్నదని పరిశోధకులు నిరూపించారు. 'ధర హెచ్చుట తగ్గు కొరకె' అనే సామెతను ఆశావాదు లెవరో సృష్టించి ఉంటారు. కాని, ఒకసారి పెరిగిన వస్తువుల ధరలు తగ్గినట్లు ఇంత వరకు దాఖలాలు లేవు. నిజానికి క్రీ. శ.5 వ శతాబ్ది నుండి 11 వ శతాబ్ది నాటికి వస్తువుల ధరలు ఏడింతలు పెరిగాయట. ఆ తర్వాత 16. వ. శతాబ్దం నాటికి పెరుగుదల మూడింట రెండు వంతులు మాత్రమేనట. తిరిగి ఈ శతాబ్ది ఆరంభం నాటికి పెరుగుదల ఏడు రెట్లు ఉన్నదట. ఇదంతా ఒక ఎత్తు, 1939-1979 మధ్య కాలంలో కేవలం నాలుగు దశాబ్దాలలోనే ధరలు 16 రెట్లు పెరిగాయట! ఇవాళ చట్టరీత్యా 100 పైస లున్న

రూపాయి అసలు విలువ కేవలం కొన్ని పైసలు మాత్రమే గదా! వస్తువుల ధరలు పెరిగాయి, ధనం విలువ పడిపోయింది. దీనితో ఎందరికో బ్లడ్ ప్రెషర్ రక్తనాళాలు చిట్లేంతగా పెరిగి పోయి ఉంటుంది. వస్తువులు కొనలేక పోతున్నామనే బాధతో అనేకానేక మందికి, తమ ధనం విలువ పడి పోయిందన్న నిరాశతో మరి కొందరికి.

అనాది కాలం నుండి, అంటే మానవుడు (తన అవసరాలకు మించి అదనంగా) వస్తూత్పత్తి ప్రారంభించినప్పటి నుండి దానిని అవసరమైన మరొకరికి యిచ్చి, తన కవసరమైన వాటిని తీసుకొనే విధానం ఉంది. అదే వస్తు మార్పిడి విధానం (బార్టర్). ఇందులో వస్తువుకు విలువ ఆపాదించే 'ద్రవ్యం' లేదు. మనీ ఎకానమీకి రూపకల్పన జరుగలేదు. కాలక్రమంలో ఇది అమలులోకి వచ్చినా, 'బార్టర్' విధానం కూడా ప్రాచుర్యంలో ఉన్నది. అంతదాకా ఎందుకు? పాతతరం వారికి ఊహ వచ్చిన తర్వాత కూడా - 1945 ప్రాంతంలో కూడా గ్రామంలో ధాన్యం పోసి వస్తువులు కొనడం, గ్రామీణ వృత్తి పని వారికి, పాలేర్లకు, పొలంలో కూలీలకు ధాన్యమే కొలవడం గుర్తుండి ఉంటుంది. చదువు చెప్పే పంతులు గారికి, మందు లిచ్చే వైద్యునికి కూడా వార్షికాలుగా ధాన్యం పంపించేవారు. దీనిలోనూ లొసుగు లున్నప్పటికీ, నోట్ల కట్టలు, నాణేల గుట్టలు లేక పోయినా, ఆ నాటి ప్రజలు సుఖంగానే బ్రతికారు. ఆర్థికంగా విభిన్న స్థాయిలకు చెందినా, ప్రజల మధ్య ఆత్మీయతకు, మానవత్వపు విలువలకు ఇది అడ్డు గోడగా నిలువలేదు.

జాతక కథలలో బౌద్ధుల కాలం నాటి ధర వరల వివరాలు నమోదైనాయి. 'పానా' యిస్తే ఒక రోజుకు అవసరమైన మాంసం, చేపలు, కూరలు యిచ్చేవారట. (పైగా ఒకగుక్క సారాయి కూడా). గాడిద ఖరీదు 8 పానాలు, ఎద్దుల జత ఖరీదు 24 పానాలు! 1921 నాటి విలువల ప్రకారం పానా అంటే ఐదు అణాలకు సమాన మని పరిశోధకుల అభిప్రాయం. ఆ నాటి రాకుమారులకు, రాజ పురోహితుడు, ఆస్థాన విద్వాంసులు, సేనాపతి మొదలైన ప్రముఖులకు ఈ నాటి చిన్న ఉద్యోగి కంటె తక్కువ జీవం లభిస్తూ ఉండాలి మరి!

స్వర్ణయుగంగా పేరు పొందిన గుప్త రాజుల కాలంలో వస్తువుల ధరలు 1930 తో పోలిస్తే ఏడో వంతు మాత్రమే ఉండేవట! 8.73 గ్రాముల బంగారం ఉన్న 'దీనారా' ఉంటే బౌద్ధ సన్యాసికి ఎంత విచ్చలవిడిగా ఖర్చు చేసుకున్నా, ఒక సంవత్సరానికి సరిపోయేదట! గుప్త సామ్రాజ్య పతనం, అంతర్యుద్ధాలు, విదేశీ దండయాత్రల ఫలితంగా వస్తువుల ధరలు పెరిగాయి. ఒక మణుగు గోధుమల ధర 35 దీనారాలట.

అక్బర్ చక్రవర్తి కాలంలో పరిస్థితులు నేటితో పోలిస్తే చాలా సుఖమయంగా ఉండేవి. ఆ నాడు 'రూపాయి' ఉంటే గ్రామంలోని వడ్రంగులకు, వృత్తి పని వారికి ఒక నెల గ్రాసానికి సరిపోయేదట. 1912 లోని మన రూపాయిలో అక్బరీ రూపాయి ఏడో వంతు మాత్రమట! బ్రిటిషు వారి కాలంలో పరిస్థితులు బాగా దిగజారి పోయా యనవచ్చు. ఆడంబరాలకు పోయి, ఇంటి నిండా నౌకర్లను పెట్టుకున్న ఇంగ్లీషు దొరలు, దేశీ సాహెబ్‌లు వారిని తగ్గించుకోవలసి వచ్చింది. వీరి జీతాలు పెరిగిపోయా యంటూ కంపెనీ రేట్లు విధించింది. వంట మనిషికి 5 రూపాయలు, ఇంటి నౌకరుకు, దర్జీకి, చాకలికి మూడు రూపాయలు, క్షురకునికి ఒక రూపాయి వేతనంగా నిర్ణయించారు. వస్తువుల ధరల విషయానికి వస్తే 1807 లో పాట్నాలో రూపాయికి 46 కిలోల బియ్యం లభిస్తుండగా, 1900 సంవత్సరం నాటికి 10 రూపాయలిస్తే గాని 37 కిలోల బియ్యం యిచ్చే వారు కాదు. ఆ తర్వాత

దేశంలోని వివిధ ప్రాంతాలలో కరువు కాటకాలు సంభవించడం, వస్తువుల ధరలు మరింతగా పెరిగి పోవడం జరిగిన విషయం అందరికీ తెలిసినదే. ఒకటిన్నర శతాబ్దాల క్రితం దేశంలో పర్యటించి తమ అనుభవాలను 'కాశీయాత్ర చరిత్ర'గా గ్రంధస్థం చేసిన ఏనుగుల వీరాస్వామయ్య ఆ నాడు వివిధ ప్రదేశాలలోని వస్తువుల ధర వరలు నమోదు చేశారు

ఆ తర్వాతి మాట. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో పూర్తిగా ధ్వంసమైపోయిన ఆగ్నేయ ఆసియా దేశాలలో ఒక కప్పు టీ కొనడానికి ఒక నోట్ల కట్ట యివ్వవలసి వచ్చేదని కథలుగా చెప్పుకొనే వారు. 20-30 సంవత్సరాల క్రితం వరకు లక్షాధికారి అంటే ఎంతో గొప్ప. ఇప్పుడు ఎవరికీ లక్ష్యం లేదు. కారణం, అలాంటి వారు కొల్లలు. కోటీశ్వరుల మాట కూడా త్వరలో ఈ కోవకే చేరబోతున్న దనవచ్చు.

అంటే ధనం విలువ అంకెలు పెద్దగా ఉన్నప్పటికీ, నిజమైన విలువ కంటికి కనిపించని నలుసులాగా అయిపోతున్నది. ఈ విలువ పడి పోకుండా ఊతం కల్పించి కృత్రిమంగా నిలబెట్టడానికి ఇటు మానవుడు, అటు దేశాలు నానా తాపత్రయం పడుతున్నాయి. ఎప్పటికో ఎందుకు గత నెలలో మన రూపాయి విలువ పడి పోతున్నదని దేశమంతా గగ్గోలు పెట్టింది. అంతా అస్తవ్యస్త మైంది. చివరకు రిజర్వు బ్యాంకు జోక్యం చేసుకొని 'ఊత కర్ర' అందిస్తే తప్ప కొంత మేరకైనా నిలబడలేక పోయింది.

దేవుడు మనిషిని సృష్టించా డంటారు కొందరు. కాదు మనిషే దేవుణ్ణి సృష్టించుకున్నాడంటారు మరి కొందరు. ఈ మీమాంస అవతల ఉంచితే, ధనాన్ని మాత్రం మనిషే సృష్టించుకున్నాడు. తన సుఖ సంతోషాలను పెంచుకోవా లని ప్రయత్నం. కాని ఏమైంది? తాను సృష్టించుకున్న 'ధనం' మానవుని కష్టాలకు మూల కారణమైందంటే ఎవరు కారణం? ఆ ధనం కోసం అన్నీ మరచి, మానవతను విస్మరించి, అంతులేని ఆశతో, అందకుండా తప్పించుకుపోతున్న ఈ ఎండమావిని చేజిక్కించుకోవాలన్న అతని తాపత్రయం కాక మరేమిటి? అంతరిక్షాన్ని సైతం జయించానని, సృష్టి రహస్యాలను ఛేదించానని, సృష్టికి ప్రతిసృష్టిగా కంప్యూటర్లు, రోబోలను నిర్మించానని, సృష్టిలోనే అత్యద్భుతమైన యంత్రం - మానవుడు-లో చెడి పోయిన భాగాలను తీసి వేసి కొత్తవి అమర్చగలిగానని గర్వంగా చెప్పుకొనే మానవుడు బహుశా తానే సృష్టించుకున్న ధనవాదం గూడులో చిక్కుకు పోయి, ఈ వలయం నుండి బయట పడలేక పోతున్నాడేమో ననిపిస్తుంది.

***Americans are increasingly likely to attribute their own - and others's -behavior to innate biological causes. At best that may relieve guilt about behavior we want to change but can't. The quest for genetic explanations of why we do what we do more accurately reflects the desire for hard certainties about frightening societal problems than the true complexities of human affairs. Meanwhile, the revolution in thinking about genes has huge consequences for how we view ourselves.***

# జ్ఞానపీఠ బహుమతి గ్రహీత
# విష్ణు సఖారామ్ ఖాండేకర్

యస్. సదాశివ

మరాఠీ సాహిత్యంలో మొట్టమొదటి జ్ఞానపీఠ పురస్కారం వి.స.ఖాండేకర్ రచించిన నవల 'యయాతి'కి లభించింది. రెండవసారి ఆ పురస్కారం అతని శిష్యుడు కవి కుసుమాగ్రజ్‌కు లభించింది. వాళ్లిద్దరూ గురు శిష్యులే. వి.స.ఖాండేకర్ పూర్తి పేరు విష్ణు సఖారామ్ ఖాండేకర్. అతని వ్యవహార నామం భావూ సాహెబ్. మహారాష్ట్రుల్లో వ్యవహార నామం ఉండడం ఒక సంప్రదాయం. కుసుమాగ్రజ్‌గా ప్రసిద్ధి గాంచిన మహాకవి పేరు వి.వా.శిర్వాడ్కర్. (విష్ణు వామన్ శిర్వాడ్కర్). అతని వ్యవహార నామం తాత్యా సాహెబ్.

భావూ సాహెబ్ పద్దెనిమిది సంవత్సరాలు 'ఆర్విల్' అనే గ్రామంలోని ట్యుటోరియల్స్ హైస్కూల్‌లో అధ్యాపకుడుగా పని చేశాడు. 'ఆర్విల్' కోంకణ్‌లోని శిరోద్ సమీపాన రమణీయమైన ప్రకృతి మధ్య వెలసిన చిన్న గ్రామం. అక్కడి ప్రకృతి సౌందర్యం భావుకుడైన భావూ సాహెబ్‌ను ఆకర్షించి వుంటుంది. ట్యుటోరియల్స్ హైస్కూల్ వ్యవస్థాపకుల్లో అత డొకడు. తేలు విషం చిమ్మినందువలన అతని రెండు కళ్లూ కనిపించకుండా పోయాయంటారు. కారణం ఏదైనా మన చిలకమర్తి వారి వలెనే అతడు గ్రుడ్డి వాడయ్యాడు. రక్తపు పోటు అధికంగా వుండేది. నిరంతర సాహిత్య వ్యాసంగం. ఏతావతా అతడు అర్ధంతరంగా ఉద్యోగ విరమణ చేసినట్లున్నాడు. రచనాసక్తి కలవాడు కనుక, అధ్యాపక వృత్తిని అవలంబించిన వాడు కనుక అధ్యయనం అతనికి అనివార్యం. సంస్కృతం,మరాఠీ, ఇంగ్లీషు భాషల్లోని సాహిత్యాన్నీ, శాస్త్రాలనూ తృప్తి తీరా అధ్యయనం చేసినట్లున్నాడు. మానవ మనస్తత్వాన్ని, సామాజిక సమస్యలను, రాజకీయ పరిణామాలను అవగాహన చేసుకోవటంలో అత డెక్కడా పొరపడలేదు. కళ్ళు పోయినా పరిణతమైన దృష్టి కలవా డతడు. అతని సమకాలికుడైన రచయిత, విమర్శకుడు నా.సీ.ఫడ్కే (నారాయణ్ సీతారామ్ ఫడ్కే) కళ కళ కోసమే (Art for arts sake) అనే వాదాన్ని బలపరిచే వాడు. ఖాండేకర్ 'కళ జీవితం కోసం' అనే వాదాన్ని బలపరిచే వాడు. కాబట్టి ఖాండేకర్ రాసిన ప్రతి నవలను, ప్రతి కథను ఫడ్కే ఘాటుగా విమర్శించే వాడు. చిత్రమేమంటే వాళ్లిద్దరిది వ్యక్తిగత వైరం కాదు. ఫడ్కేకు భావూ సాహెబ్ పట్ల ఎనలేని గౌరవాభిమానాలు. 1930 నుంచి 1942 వరకు సంవత్సరాని కొక్కటి చొప్పున పన్నెండు నవలలు ప్రచురించాడు ఖాండేకర్. అన్నీ సామాజిక నవలలే. 1942 లో అతడు రాసిన నవల క్రౌంచ్‌వధ్. పేరు వింటే అది రామాయణానికి సంబంధించిన నవల అనిపిస్తుంది. కాని కాదు. కాంచన్ మృగ్ అలాంటి నవలే. సామాజిక నవలలు రాస్తూ వాటికి పౌరాణిక నామా లుంచటం ఖాండేకర్‌కు ఇష్టమనుకోవాలె. 1930 లో గాంధీజీ నాయకత్వాన జరిగిన ఉప్పు సత్యాగ్రహాన్ని పురస్కరించుకొని అతడు రాసిన "సాగరా! అగస్తీ ఆలా" అనే కథ గూడా పౌరాణికేతివృత్తం కలదే అనిపిస్తుంది. భారతీయ సంస్కృతికి పునాదులైన రామాయణ మహాభారతాలనూ, పురాణాలనూ, కావ్య నాటకాలనూ అభిరుచితో, ఆసక్తితో, అభిమానంతో విన్నవాడూ, చదివినవాడూ కనుక తన కథలకూ, నవలలకూ,పౌరాణిక నామా లుంచటం, తన రచనల్లో పురాణ పాత్రలను,ప్రతీకలను వాడుకోవటం అతనికి ఇష్టం.

"సముద్రుడా! అగస్త్యుడు వచ్చాడు" అనే కథలో అగస్త్యుడు గాంధీజీకి ప్రతీక. లేదా, గాంధీజీ అగస్త్యునికి ప్రతీక. పురాణాల్లో అగస్త్యుడు సాగర జలాన్నంతటిని త్రాగాడు. గాంధీజీ సాగర జలాల్లోని లవణాన్ని సంగ్రహించాడు.

క్రౌంచవధ్, కాంచన మృగ్, కాక 'దోన్ ధ్రువ్', 'పాంఢ్రే ఢగ్', 'ఉల్కా', 'అశ్రు', 'అమృత్ వేళ్' మొదలయిన యాభై రచనలు చేశా డతడు. 1930 నుంచి 1942 వరకు అతడు రాసిన పన్నెండు సాంఘిక నవలల్లో రెండే రెండు లక్ష్యాలు వివిధ కోణాల్లో వివరించబడినాయి. ఒక లక్ష్యం రాజకీయ స్వాతంత్ర్యం - ఇంకో లక్ష్యం సంఘ సంస్కరణ. స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ, దాని స్వరూప స్వభావ పర్యవసానాలు, కలవాళ్లకూ, లేనివాళ్లకూ మధ్య గల అంతరం, దాన్ని పూడ్చే ప్రయత్నం- సంఘంలోని అంధ విశ్వాసాలు, దురాచారాలు- వాటిని దూరం చేసే పథకాలు. ఆకాలపు అన్ని భాషల సాంఘిక నవలల్లోని ఇతివృత్తం ఈ గిరిలో తిరిగేదే గదా. ఆ నవలలు రాసే కాలంలో 'యయాతి' లాంటి పౌరాణికేతివృత్తం గల నవల రాయగలనని అతడనుకోలేదు. అత న్నెరిగిన వాళ్లెవరూ అనుకోలేదు. కాని యయాతి అతని మనసులో నలభై యైదేళ్లుగా రూపు దిద్దుకుంటూ వున్నాడు. చిన్నప్పుడు యయాతి కథ వింటుంటే ముసలితనం పడుచుతనం మార్పిడి అద్భుతంగా అనిపించే దతనికి. కొడుకు యౌవనాన్ని తండ్రి లాక్కోవటం అన్యాయ మనిపించేది. తన కొడుకు హుమాయూన్‌కు తన ఆయుష్షు నిమ్మని బాబరు అల్లాను ప్రార్థించినట్లు హైస్కూల్ చరిత్రలో చదివి వున్నాడు కనుక అప్పట్లోనే ఏ ప్రచురణకర్తయినా అతన్నొక నవల రాసి యిమ్మంటే యయాతిని గురించి మాత్రం రాసేవాడు కాడు. బాబర్ గురించి రాసేవాడు. (ఇవన్నీ అతడు తన యయాతి ఉపోద్ఘాతంలో చెప్పుకున్న మాటలే. ఆ వుపోద్ఘాతం మొదటి ఎనిమిది ముద్రణల్లో కనిపిస్తుంది. తర్వాత క్రొత్త వుపోద్ఘాతం రాసినట్లున్నాడు.) శర్మిష్ఠ పట్ల గూడా అతనికి సద్భావం వుండేది కాదు. దేవయానిని అగ్ని సాక్షిగా వివాహం చేసుకున్న స్త్రీ లోలుడైన యయాతిని దాసిగా వున్న తాను తన శరీర సుఖం కోసం, సంతానం కోసం నయవంచకిగా మాట్లాడి వలలో వేసుకొని గాంధర్వ వివాహం చేసుకున్న కాముకి అని భావించేవాడు. మహాభారతంలో అలాగే వున్నది. ఆ భావం భావూ సాహెబ్ కాలేజీలో చదివే రోజుల్లో తొలగి పోయింది. కాళిదాసుని శాకుంతలం కాలేజీ సిలబస్‌లో వుండేది. రమ్యమైన చతుర్థాంకంలో, రమ్యమైన శ్లోక చతుష్టయంలోని ఒకశ్లోకంలో కణ్వ మహర్షి శకుంతలను అత్తగారింటికి పంపే సందర్భాన బుద్ధులు చెబుతూ, ఆశీర్వదిస్తూ "యయాతే రివ శర్మిష్ఠా భర్తుర్బహుమతా భవ" అంటాడు. కణ్వు డంతటి ఋషి అత్యంత ప్రేమతో పెంచిన శకుంతలను శర్మిష్ఠ తన భర్త ప్రేమకు పాత్రురా లైనట్లు నువ్వూ నీ భర్త ప్రేమకు పాత్రురాలివి కమ్మంటాడేమి? కవి కుల గురువు కాళిదాసు కణ్వుని నోట అనిపిస్తున్నాడీ మాట. అంటే శర్మిష్ఠ, యయాతి మధ్య వున్నది కేవల కామం కాదు. దాని కవతల వుండే ప్రేమ. యయాతికి దేవయాని శరీర సుఖాన్ని మాత్రం ఇయ్య గలిగింది. శర్మిష్ఠ శరీర సుఖాన్నే కాక అవ్యాజమైన తన ప్రేమతో అతని ప్రేమను చూరగొనగలిగింది. సంస్కృతాచార్యుడు డా. గిన్నే నడిగితే అత డేదో సమాధానం చెప్పాడు. కాని భావూ సాహెబు కది సంతృప్తి కలిగించలేదు. చిన్ననాడు తాను విన్న పౌరాణిక కథ లన్నింటిని తానే విశ్లేషించ సాగాడు. పాత్రల మనస్తత్వాల్ని వాళ్ళ ప్రవర్తనకు వెనుక గల కారణాలను అన్వేషించ సాగాడు. 'ఉల్కా' అనే నవలను మూడు వారాల్లో ముగించిన భావూ సాహెబ్‌కు యయాతిని రాయడానికి ఆరేడేండ్ల కాలం పట్టింది. అతని మనస్సు క్షోభ చెందింది. "1942 లోనే ఈ నవలను

రాసి వుంటే దీని పేరు 'శర్మిష్ఠ ప్రేమ కథ' అయివుండేది" అంటా డతడు. 1947 లో స్వాతంత్ర్యం సిద్ధించింది. దేశం ముక్క లయింది. రక్తపాతం, నిర్వాసితుల ఆక్రందనలు - బెంగాల్‌లో లక్షలాది మందిని పొట్టన బెట్టుకున్న కాటకం. స్వాతంత్ర్యం తర్వాత అంతా ఆశించిందే జరిగిందా? నెహ్రూ గారు కలలు గన్న శాస్త్ర సాంకేతికాభివృద్ధి వలన దేశ సంపద పెరిగిన మాట వాస్తవమే. అయినా అదెందరికి లభించింది? మూడు రంగుల జెండా వైపు ఆశతో చూస్తున్న కోటి కోటి దీన దళితుల విషణ్ణ వదనాలు. అధికార ధన బల మదాంధుల అధఃపతనాలు. అడుగంటి పోయిన నైతిక విలువలు. ఆచరణ సాధ్యం కాని సుఖ శాంతుల ప్రస్తావనలు. మితి మీరిన భోగలాలసత - గతి తప్పిన బ్రతుకులు. యయాతి వీళ్లందరికి ప్రతినిధి. ఈ నవలలోని యయాతి మహాభారతంలోని యయాతి కాదు. ఇందలి కచుడు మహాభారతంలోని కచుడు కాడు. సంజీవిని విద్యను సంగ్రహించిన తర్వాత మహాభారతంలో కచుడు మళ్లీ మనకు కనిపించడు. ఈ నవలలో చివరివరకువుంటాడు కచుడు సాహసి. దృఢ దీక్షాపరుడు. త్యాగశీలి.ప్రేమమూర్తి. దేవయానిని అతడూ ప్రేమించాడు. అది సహజం. కాని అది సఫల మయ్యేది కాదని గ్రహించిన వాడు కనుక అసాధారణమైన సంయమనం పాటించాడు. దేవయాని పట్ల యేర్పడిన తన ప్రేమను, స్నేహాన్ని ఆర్తు లందరికీ అందించాడు. యయాతిని, యతిని చివరి వరకు ఆదుకున్నాడు. బ్రహ్మర్షిత్వాన్ని పొందుతానని సర్వ సంగాలు త్యజించి, పారిపోయిన యతి చివరికి మనిషి కూడా కాలేక పోయాడు. కచుని సహవాసం వలన మంచి మనిషి అయ్యాడు. అతడే శర్మిష్ఠకు అన్ని విధాలా అండగా వుండి, ఆమె కొడుకు పూరునికి క్షాత్ర విద్యలు నేర్పించే ఏర్పాటు చేశాడు.

అధికార ధన మదాంధులకు ప్రతినిధి యయాతి. ఈ యయాతుల సంఖ్యే అధికం. కచులు నేటి సమాజానికి అవసరం. వాళ్ళ సంఖ్య అత్యల్పం. సమాజానికి పనికి రాకుండా బ్రహ్మ విద్య గడించి ఏదో సాధిస్తామని భ్రమ పడే సన్యాసులకు ప్రతినిధి యయాతి. వ్యర్థజీవి. భావూ సాహెబ్ అన్నట్లు, ఇందలి దేవయాని గాని, శర్మిష్ఠ గాని మహాభారతంలోని వాళ్ళు కారు. ఇతివృత్తం పౌరాణికమే కాని దానిలోపలి పొరల్లో నేటి సమాజం, నేటి మనుష్యులు, వాళ్ల చిత్తవృత్తి, వాళ్ల సమస్యలు - అన్నీ లీలగా కనిపిస్తాయి.

భావూ సాహెబ్ నవలలను ప్రొఫెసర్ కుసుమావతీ దేశపాండే "హోల్డాల్" వంటివి అని పరిహాసానికి అనేది. ఆమె సుప్రసిద్ధ విమర్శకురాలు. 'యయాతి'లోనూ కథా గమనానికి తోడ్పడని వర్ణనలు చాలా కనిపిస్తాయి. ఉదాహరణలు, ఉపమాద్యలంకారాలు కూడా అక్క డక్కడ కనిపిస్తాయి. అన్నీ రమణీయంగా ఉంటాయి. ఒక్క వాక్యం కూడా విడిచి పెట్టాలనిపించదు. పఠితలను పట్టి చదివించే నేర్పు భావూ సాహెబు కున్నది. సావకాశంగా, సాలోచనగా చదవాల్సిన నవల యిది. దీన్ని మరాఠీ సాంఘిక నవలలకు ఆద్యుడైన హరిభావూ (హరి నారాయణ్ ఆప్టే)కు అంకిత మియ్యటం ఖాండేకర్ ఔచిత్య దృష్టికి నిదర్శనం!

# Know the literary world

1 This famous author of *les Miserables* always preferred to work standing up against a shoulder-high desk Sometimes, he used to work 14 hours at a stretch Can you name him?

2 Who offers this fall-safe prescription for a happy married life *To keep your marriage brimming with love in the marriage cup, whenever you're wrong, admit it, whenever you're right, shut up?*

3 This highly eccentric French writer, the author of a number of novels, plays and poems said, *"I have never refused money to anyone, except to my creditors."* Who was this literary celebrity?

4 Who thinks *Early to rise and early to bed makes a male healthy, wealthy and dead?*

5. A hard-headed realist wrote: *We all have sufficient strength to bear other people's misfortunes.* Can you name him?

6 Who made this observation about books. *Some books are to be tasted, others to be swallowed, and some few to be chewed and digested?*

7. Who gave this interesting definition of a classic: *A classic is something that everybody wants to have read and nobody wants to read?*

8. This line from a modern poem is an apt commentary on the futile and meaningless life of a modern man. *I have measured out my life with coffee spoons* Can you name the poet?

9. There lies buried in Calcutta's Park Street Cemetry, an English girl loved by an English poet. His poem, *Rose Aylmer* ends with these lines . *Rose Aylmer, whom these wakeful eyes may weep, but never see. A night of memories and sighs consecrate to thee*

10. Which poet said : *As civilization advances, poetry almost necessarily declines?*

11. Who wrote the American national anthem, *The Star Spangled Banner?*

12. This poet translated the original Persian text of *The Rubaiyat* of *Omar Khayyam*, and the translated version has the force and beauty of the original text. Can you name the poet?

13 A poet wrote about his books *When I am dead, I hope it may be said, 'His sins were scarlet, but his books were read'*. Can you name the poet?

14. This poet's whole-hearted devotion to the *anti-slavery movement* made him famous not only in literary, but political circles too. Who was he?

15. Who said : *A pretty girl who is naked is worth half a million statue?*

16. A famous 18th century dramatist wrote speeches for his plays as he walked the streets because he was too poor to afford a lodging. Who was he?

17 Who gave this sound advice to husbands . *Being a husband is a whole-time job. That is why so many husbands fail. They cannot give their entire attention to it?*

18. The author of the famous novel *Dr. Zhivago* was available only on Sundays when he held an open house, otherwise one could never meet him. Can you name him?

19. This novel consists of Part one - *You are the Light of the World*, Part two - *Human Horses and their Chariots of Fire*; Part three - *Calcutta, My Love* Can you name the novel?

20 *Metamorphosis* is the story of a man who is transformed into a cockroach Who is the author?

## ANSWERS

1. Victor Hugo (1802-1885), French writer. He established his position as the pioneer of the Romantic Movement in French Literature. He is primarily known for his novels which include *Notre-Dame deParis* (1831), and *Les Miserables* (1862).
2 Ogden Nash (1902-1971), American Humourist. Treading gently on many a toe, this poet-humorist produced a rich harvest of light verse which mocked at a number of established conventions. He is known, among other things, for his *The Primrose Path* (1935), *I'm a Stranger Here Myself* (1938), and *You can't Get There from Here* (1957).
3 Alexander Dumas (1802-1870), French playwright and novelist. He is known for his novels *The Count of Monte Cristo* and *The Three Musketeers.*
4. James Thurber (1894-1961), American cartoonist and writer. He worked as Managing Editor (1927-33) of *the New Yorker* to which he contributed throughout his career humorous drawings, essays and short stories
5 La Rochefoucauld (pronounced as la-rosh-foo-ko), 1613-1680, French writer and moralist. His fame rests upon his *reflexions ou sentences et maximes morals* (1665)
6 Francis Bacon (1516-1626), English philosopher ad author His chief literary works include essays known for their encyclopaedic range of knowledge and aphoristic quality. The quotation referred to here comes from his essay *Of Studies.*
7 Mark Twain, pseudonym of Samuel Clemens (1835-1910), American writer Famous for his novels *The Adventures of Tom Sawyer,* (1876) and *Adventures of Huckleberry Finn* (1884). The quotation in question comes from his speech *'The Disappearance of Literature*
8 Eliot wrote this in his poem *Love Song of J. Alfred Prufrock* The protagonist of the poem is a representative of the modern society which is sick with divided aims and meaningless strike.
9 W L. Landor (Walter Savagte Landor, 1775-1864) Rose Aylmer was an early love of Landor's, but on her mother's second marriage was sent out to her aunt at Calcutta where she died, aged twenty
10. Lord Macaulay (Thomas Babington Macaulay, 1800-1859), English writer and politician. He remained Member, Supreme Council of India from 1834-1838. The statement in question occurs in his essay on Milton published in *Edinburgh Review* (1825)
11. Francis Scott Key. He saw the American flag still fluttering on Fort McHenry after a night's heavy bombardment by the British This sight inspired him to compose the poem which, by an act of the Congress in 1931, became the *American National Anthem*
12. Edward Fitzgerald was a literary artist with a keen poetical imagination Omar Khayyam was a Persian astronomer-poet Fitzgerald's translation of Omar Khayyam's Rubaiyat made both of them world-famous.
13. Hilaire Belloc (1870-1953), English author and newspaper and magazine editor Author of essays, verse, novels, history, biography and criticism The lines quoted here come from his epigrams
14. John Greenleaf Whittier (1807-1982) He was a vigorous crusader against slavery Among his widely known poems are *Massachusetts to Virginia, Maud Muller, Barefoot Boy, Telling the Bees etc*
15 E E. Cummings (1894-1962), American poet and painter, writer of poetry distinguished by experimental diction and unorthodox typography and punctuation.
16 Richard Savage (died 1743), the author of *The Wanderer* (1789), and *The Bastard* (1728), was a man of humble birth and inspite of his success as a dramatist, died in great poverty The romantic story of his birth and inspite of his success as a dramatist, died in great poverty The romantic story of his birth and misfortune is given in Dr Johnson's long and interesting life of him
17 Arnold Bennet (1867-1931) English novelist, dramatist and critic His novels realistically depicted provincial or lower class life
18 Boris Pasternak (1890-1960), Soviet poet, novelist and translator He came to symbolize the struggle between the artist and hostile political environment His novel Dr Zhivago (1957) offended the Communist government, and he was expelled from the Soviet Writer's Union He was awarded Nobel Prize in Literature in 1958
20 Franz Kafka In this story, a German salesman sleeps one night and the next morning, finds himself metamorphosised into a giant cockroach Ends

ప్రియమైన 'మిసిమి' పత్రికా సంపాదకుడు గారికి

మీ పత్రిక రెగ్యులర్‌గా అందుతుంది. క్రమం తప్పకుండా, అడిగినదే తడవుగా వుచితంగా 'మిసిమి' పత్రికను మా చేతికి అందిస్తున్నందుకు మరోసారి పీపుల్స్ వార్ రాజకీయ ఖైదీల తరపున కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం. మీరు ప్రెస్ క్లబ్‌లో నిర్వహిస్తున్న "నేటి పత్రికా ప్రపంచంలో 'మిసిమి' పాత్ర" సెమినార్ ఆహ్వాన పత్రం అందింది. నిర్బంధ శిబిరంలోని మీ పాఠకులకు కూడా మీ కార్యక్రమాల వివరాలు అందిస్తున్నందుకు ధన్యవాదాలు. నిర్బంధ శిబిరంలో వున్న మేము మీ సెమినార్‌కు ఎలాగూ హాజరు కాలేము. సెమినార్‌ను విజయవంతంగా జరుపుకోవాల్సిందిగా కోరుతున్నాం. సెమినార్‌కు హాజరయ్యే ఉపన్యాసకులకు, ప్రతినిధులకు, నిర్వహకులకు హృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాం.

'మిసిమి' తాత్విక, సాహిత్య, కళా అంశాలతో కొత్త కాంతిని మొదటి పేజీ నుంచి చివరి పేజీ వరకు నింపుకుని వెలువడుతున్నది. తెలియనివి, తెలుకోవల్సినవి ఎన్నో తాత్త్విక, సాహిత్య అంశాలను గత చరిత్ర నుండి వెదికి పాఠకులకు అందించడం హర్షణీయమే. సాధారణ అంశాలతో పోల్చినప్పుడు తాత్త్విక, సాహిత్య అంశాలు కొంత కష్టతరమే. 'మిసిమి' పత్రికలోని వ్యాసాలు మరింత సులభతరంగా రావడం వల్ల సామాన్య పాఠకులను చేరుతుంది (భావంతో సహా).

తాత్త్విక అంశాల్లో భారతీయ తత్వ శాస్త్రంలోని భౌతిక వాద ధోరణులపై వ్యాసాలు వస్తున్నాయి. ప్రాచీన భారతం నుంచి నాస్తికమే (చార్వాకుల నుంచి) ప్రధాన అంశంగా చరిత్రలో కనబడినా, కాలక్రమంలో దోపిడి వ్యవస్థను చిరకాలం మనుగడలో వుంచడం కోసం ఆస్తికాన్నే ప్రధానం చేశారు. నాస్తిక (భౌతిక వాద) చరిత్రను మరుగుపరిచి ఆధ్యాత్మిక వాదాన్ని సృష్టించారు. ఈ యాబది సంవత్సరాల్లో తత్వ శాస్త్రం - భౌతికవాదం నుంచి గతితార్కిక భౌతిక వాదంగా ఎదిగింది. ఈ గుణాత్మకమైన మార్పుకు రష్యా విప్లవ ప్రభావం విస్తృతంగా వుంది. అకడమిక్ అధ్యయనం పరిశోధనలు జరిపే స్థాయికి ఎదిగింది. భారత చరిత్ర నంతా గతి తార్కికంగా పరిశీలించి ఇంకా వాస్తవాలను బయటికి తీయాల్సి వుంది. ఈ దిశగా దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ, రాహుల్ సాంకృత్యాయన్, డి.డి.కోశాంబీలు పయనం సాగించి చరిత్ర పురోగమనాన్ని, గతితార్కిక భౌతిక వాదదృష్టితో భారత చరిత్రను మన ముందుంచారు. గతితార్కిక భౌతిక వాద దృష్టితో - తాత్విక, సాహిత్య, చారిత్రక అంశాలపై 'మిసిమి'లో మరిన్ని వ్యాసాలు రావాలని ఆశిస్తున్నాం.

పత్రిక మొదటి, చివరి కవర్ పేజీలపై వర్ణ చిత్రాలు చాలా అందంగా బాగా వున్నాయి.

యస్. అప్పారావు. (రాజకీయఖైదీ) యుటి నెంబర్ 434

బ్లాక్‌నెంబరు 8, సెంట్రల్‌జైలు, చంచల్ గూడ, హైదరాబాద్ 500 024. (సెన్సార్డ్)

ఎస్.ఆర్. కాట్రగడ్డ చికాగో

1-10-1995

మాన్యులు డా॥ ఆలపాటి రవీంద్ర నాథ్ గారికి-

నమస్కారం !

మీ 'మిసిమి' పత్రిక నెలనెలా సకాలంలో మాకు అందుతూంది. మంచి కాగితం మీద చక్కని ముద్రణతో వెలువడుతున్న మీ పత్రికను ఆసక్తితో చదువుతున్నాను. మంచి అభిరుచితో ఆలోచనా ప్రేరకమైన వ్యాసాలు ప్రచురిస్తున్నందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను.

అయితే - కొన్ని వ్యాసాలలో భాష మరీ కఠినంగా ఉంటూంది. ఇంగ్లీషు మాటలకు రచయితలు కొత్తగా కల్పిస్తున్న సంస్కృత పదాలు అర్థంకావడం లేదు. శాస్త్రీయమైన కొన్ని వ్యాసాలు ఆ శాస్త్రంతో ఇంతకు ముందు పరిచయం ఉన్న పాఠకుల కోసమే ఉద్దేశించినట్లు కనిపిస్తుంది. అలాంటి వ్యాసాలను మరి కొంత పల్చన చేసి అందరికీ అర్థం అయ్యే సరళమైన భాషలో వ్రాయిస్తే బాగుంటుందని నా సూచన. ఆలోచించండి!

'మిసిమి' పత్రికకు మరొక సారి శుభాకాంక్షలు తెలియజేస్తూ -

భవదీయుడు
కాట్రగడ్డ, ఎస్.ఆర్.

By Air Mail

మధురవాణి మాట కచేరీ

# సాహిత్యంలో సరిగమలు

- సత్తెనపల్లి రామమోహనరావు

పంతులుగారితో రామచంద్రపురం వెళ్ళిపోయొచ్చిన దగ్గరనుంచీ వీణ మాటే మరిచిపోయాను అదివరకు విజయనగరంలో వున్నప్పుడు అప్పుడప్పుడు వీణ వాయిస్తూ వుండే దాన్ని. గొంతు విప్పి హాయిగా పాడుకుంటూ వుండేదాన్ని. ఇక్కడికి వచ్చిన తర్వాత అన్నీ మరిచిపోయాను. ఆ రోజెందుకో బుద్ధిపుట్టి వీణ తీసి దుమ్ము దులుపుతుంటే – "వీణాగానం వెన్నెల తేట – రాణమీరగా రమణుల పాట –" అన్న కవిగారి మాటలు గుర్తుకు వచ్చాయి. సామాన్యంగా సాహితీ ప్రియులు సంగీత ప్రియులు కూడా అయివుంటారు. అందుకే కాబోలు సరస్వతీ దేవికి సంగీత సాహిత్యాలు రెండూ రెండు కళ్ల వంటివి అన్నారు. ఇలాంటివే ఏవో ఊహలు మనసులో కదులుతుంటే శృతి సరిచేసుకుంటున్నాను ఇంతలో వచ్చాడు రామప్పపంతులు "వీణ సాధకం చేసుకుంటున్నావా? చెయ్యి. విద్యవంటి వస్తువు లేదు –" అన్నాడు. విద్యవంటి వస్తువు లేదు – నిజమే . ఒక్కటి తప్ప. అదేమిటి – విత్తం. డబ్బులేని విద్య దరిద్ర హేతువు. ఈ ఊళ్ళో నారదు డొచ్చి వీణ వాయించినా, తుంబురుడొచ్చి గానకచేరీ చేసినా ఒక్క దమ్మిడీ యివ్వరు. అలాంటిది నావంటి దాని పాటకు విలవే ముంటుంది? - సంగీత మనగానే నా కెందుకో గిరీశమే గుర్తుకు వస్తాడు. అసలు ఏ విషయం కదపబోయినా ఆ మహానుభావుడే జ్ఞాపకం వస్తాడు. గిరీశం - జాక్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్ కదా - అందుకని కావచ్చు. "కాముని విరి శరముల బారి నేనేమని సహింతునే చెలి యేమని సహింతునే -" అంటూ కూనిరాగాలు తీస్తూనే కదా అమాయకప్పిల్ల బుచ్చెమ్మను అతగాడు వల్లో వేసుకుంది. సంగీతం ఎవర్నయినా ఆకర్షిస్తుంది అని చెప్పటానికి ఎన్నయినా దృష్టాంతాలు వున్నాయి. అయితే యిందుకూ మినహాయింపులు వుండకపోవు. ఒకసారి పోలిశెట్టి దగ్గర చేతులు నెప్పులు పుట్టేటట్లు గంటసేపు వీణ వాయిస్తే - "అంతచేటు లాగితే తీగలు తెగిపోవూ? - ఎందుకయినా మంచిది డజను తీగలు తెప్పించి కొట్లో ఎట్టమంటావా ఏటి? - అవసరమయినప్పుడు నువ్వే కొనుక్కుందువు గాని -" అన్నాడు. అసలు సెట్టిగారికి యిలాంటి పాటలేం నచ్చుతాయి కనక? ఆయనకు నచ్చేవి ఒక్క వేలం పాటలే. ఎంత సేపు ఎవరి పొలానికి ఎసరు పెడదామా? ఎవరి ఇల్లు వేలానికి తెద్దామా? అని తప్ప మరో ఆలోచన ఆయన బుర్రలో ఎందుకుంటుంది? శుభమా అని సంగీతం గొడవలో వేలం పాటల ప్రసక్తి ఎందుకు కాని - మన తెలుగు కవులు రాసిన పుస్తకాలు చాలా వాటిల్లో సంగీతం ప్రసక్తి కూడా వుండటం నాకు సంతోషాన్ని కలిగిస్తుంది.

కవులు తమ కావ్యాలలో సంగీత ప్రసక్తి తేవటం శ్రీ కృష్ణదేవరాయల కాలం నుంచీ వస్తున్నదే. అష్ట దిగ్గజా లంతా అంతో యింతో సంగీతాభిరుచిని తమ కావ్యాలలో వ్యక్తం చేసినవాళ్ళే! రాయల వారు స్వయంగా వీణ వాయించే వాడుట. పెద్దనగారు వరూధినితో - "ఝుణఝుణ ధ్వని స్ఫూర్తి తాళ మానములు గొలుప నింపు దళుకొత్త -" మధుర మంజులంగా వీణ వాయింపించాడు. అంతేకాక- "రహివుట్ట జంత్రగాత్రముల రాల్ గరగించు విమల గాంధర్వంబు విద్య మాకు..." అంటూ తన సంగీత కళా వైదుష్యాన్ని గురించి కూడా గొప్పగా చెప్పుకుంటుందా అచ్చర లేమ! అయితే అందరికంటె "వసుచరిత్ర" రాసిన భట్టుమూర్తి సంగీతంలో నిధే అని చెప్పవచ్చు. ఈయన సంగీతంలో విశేషంగా కృషి చేసి "సంగీత కళా రహస్య నిధి" అనే బిరుదును కూడా సంపాదించాడుట. బిరుదును వట్టినే పోనిచ్చుకోకుండా తన కావ్యంలో సంగీత ప్రసక్తిని పదే పదే తీసుకొచ్చాడు. భట్టుమూర్తి పద్యా లన్నీ రాగాలు పాడుతున్నట్లే వుంటాయి. అసలు గ్రంథ ప్రారంభంలో సరస్వతీ స్తుతిలోనే "రమణీయాక్షర కృతిన్ బొలుచు వర్ణవేణి వీణానులాపము చేత గరగించి -" అంటూ సంగీత సాహిత్యాలు

రెంటినీ తనలోనే లీనం చేసుకున్న వీణాపాణిని కళ్ళముందు సాక్షాత్కరింప చేస్తాడు రామరాజ భూషణుని ఒక పద్యం రాగం పాడితే - "ఉద్ధతరిపు విద్ధతపన పద్ధతి కరిభవన దవవి పటదంబుధి-" అంటూ సాగిపోయే మరో పద్యాన్ని రాగయుక్తంగా చదువుతుంటే మృదంగం వాయిస్తున్నట్లే వుంటుంది. అలాగని నాకు గిరీశం గారే ఒకసారి చెప్పాడు - ఆయన నా షద్యాన్ని మృదంగం వాయిస్తున్నట్లుగానే చదివి వినిపించాడు కూడా అసలు వసు చరిత్రలో నాయిక గిరిక వీణవాయిస్తూనే మొదటగా నర్మసచివుడికి కనిపిస్తుంది. "ప్రచుర తానామృతముల మూర్ఛనలచే న చేతనంబులు చేతన రీతి దనర జేతనంబు లచేతన భాతి నొనర, వీణ వాయించు నొక యలివేణి గంటి-" అంటూ అతగాడు గిరికను వర్ణిస్తాడు. రతీ దేవిలాంటి చక్కదనం, భారతీదేవిలాంటి వీణా వాదన ప్రౌఢిమ వుండబట్టే ఆ సుందరి వసురాజు చిత్తాన్ని ప్రథమ వీక్షణంలోనే కొల్లగొడుతుంది. ఈ ప్రబంధంలో వసంతోత్సవ సమయంలో స్త్రీలు హిందోళ రాగంలో పాటలు పాడితే, విరహాన్ని తట్టుకోలేక గిరిక కాంభోజిరాగం పలుకుతున్న వీణ లాగ ఏడుస్తుంది. మొత్తం మీద ఈ కవి తన పద్యా లన్నిటికీ రాగాలతో ముడిపెట్టి కావ్యాన్ని సంగీత సాహిత్య సమ్మిళితం చేశాడు.

'రాధా మాధవం' అనే కావ్యం వ్రాయటం వల్ల 'రాధామాధవ కవి' అని పేరు తెచ్చుకున్న యెల్ల నార్యుడు సంగీతానురక్తిలో వెనకటి కవు లందర్నీ మించిపోయాడు. ఈయన సాక్షాత్తు సరస్వతీ దేవి చేతే తన పట్టుచీర కొంగుతో వీణను తుడిపిస్తాడు. తన చేలాంచలాలతో వీణను తుడిచి, పద్మాసనం వేసి కూర్చొని, వీణ వొళ్ళోపెట్టుకొని - "కొలదిగ రాగ బేధములకున్ దగు సారెలు సారె కొత్త తంత్రులు కొనగోళ్ళ -" మీటుతూ వాణి వీణ వాయించిందంటాడు యీ కవి.

సంగీతం ఒక్క కవులనే కాదు, సర్వులనూ ఆకర్షిస్తుంది. అందుకే లుబ్ధావధాన్లు పెళ్ళికి చుట్టపు చూపుగా వెళ్తే నన్ను పాడమంటూ ఆఖరికి కుర్రకుంక కొండిభొట్లు కూడా వెంట పడడమే! ఇంతోటి పెళ్ళికి బాగా వాయించరా సన్నాయి అన్నట్లు అంతోటి ముసలాడి పెళ్ళికి నా పాట కచేరీ కూడానా అని చెప్పి పాడాను కాను. పెళ్ళికొచ్చిన పెద్ద లంతా దిగాలుపడి పోయారు. అసలా పెళ్ళి తంతూ, అదీ చూస్తూంటే ఒక వైపు వొళ్ళు మండి పోతోంది - మరో వైపు, అమ్మాయి వేషంలో వున్న శిష్యుణ్ణి పెళ్ళి చేసుకుంటున్న ముసలాణ్ణి చూసి నవ్వూ వస్తోంది. రెంటి మధ్యా సతమతమైపోతూ యింకా పాటలు కూడానా అని మూతి బిగించుకు కూర్చున్నాను కాని - కనీసం కూని రాగం అన్నా తీశాను కాను.

మనసులో మమతవుంటే, హృదయంలో ఉల్లాసం కలిగితే పెదిమెల మీద పాట లాస్యం చేస్తుంది. ఎంకీ నాయుడుబావలు అలాంటి ప్రేమబంధంలో బిగిసిపోయారు కాబట్టే - "పది మందిలో 'యెంకిపాట' నే పాడంగ గోడ సాటున యెంకి గుటకలేస్తాది-" అని మురిసిపోతాడు నాయుడు బావ. అంతటితో ఊరుకోకుండా - "సూడాలి నా యెంకి సూపులా యేళ, సూడాలి నా యెంకి సోద్దెమా యేళ-" అంటూ వినేవాళ్ళను కూడా ఊరిస్తాడు. నిర్మలమైన హృదయాలకు గిలిగింతలు పెట్టేవి యిటువంటి పాటలే! కళాపూర్ణోదయ కావ్యంలో సంగీత ప్రసక్తి ఎక్కువగానే వుంది. సంగీత విద్యా విషయంలో నారద, తుంబురుల మధ్య గల మాత్సర్యం, నారదుడు తానూ తుంబురునంతటి వాడు కావాలనే ఉద్దేశంతో శ్రీ కృష్ణుని వద్ద శిష్యరికం చేయటం యీ కావ్యంలోని ప్రధాన ఘట్టాలు. నారదుడు ఒకనాడు తుంబురుని యింటికి వెళ్ళాడుట. అప్పుడు అక్కడ - "పాట కాయితముగ మేళగించి యున్న వీణను- " తాకి చూచి యపూర్వమైన ఆ శ్రుతుల పెంపుకు నివ్వెరపడిపోయి పక్కకు వచ్చేస్తాడు. పూర్వం వీణను ఒక్కొక్కరాగానికి ఒక్కొక్క విధంగా శృతిని సరిచేసుకొని వుంచేవారుట. ప్రస్తుతం వున్న విధంగా వీణలకు మెట్లు ఏర్పరిచింది రామరాజ భూషణుడే అంటారు. పింగళి సూరనగారి కావ్యంలోని నారదుడు జాంబవతి, రుక్మిణి, సత్యభామల దగ్గర ఒక్కొక్క సంవత్సరం, కృష్ణుడి దగ్గర ఒక

సంవత్సరం సంగీత శిష్యరికం చేసి, ఆ విద్యలోని మెళుకువ లన్నిటినీ గ్రహిస్తాడు. "ప్రౌఢితో సరిగమపదని స్వరంబుల ప్రతినియత శృతిక్రమము లెరిగి, రాగభేదముల వర్ణ్యలు దొలంగించి, లయతాల శుద్ధి నెంతయుదలిర్ప, గ్రామ విశేష మూర్ఛన లేరుపడ మంద్ర మధ్యమ తార సామగ్రి దనర- " సంగీత కళా రహస్యాలన్నిటినీ ఆకళింపు చేసుకొని- "ఇక నీ సంగీతమ్మునకు నీడు లేదు జగమ్ముల..." అంటూ శ్రీ కృష్ణులవారి దగ్గరనుండే సర్టిఫికెట్టు సంపాదిస్తాడు నారదుడు. అన్ని శాస్త్రాలకంటె సంగీత శాస్త్రం అభ్యసించటానికి సాధన చాలా అవసరం. అలా సాధన చేసి, సాధించిన వీణనన్నా కాస్త మెరుగు పర్చుకోటానికి నాకు అవకాశం ఎక్కడుంది కనుక? - తెల్లవారిలేచిన దగ్గరనుంచి రాఁవప్పపంతులు నడిపే లావాదేవీలు, చేసే నిర్వాకాలు చూస్తుంటేనే కడుపు నిండిపోతోంది - ఇహ సంగీత సాధన కూడానా ఇలాంటి మనుషుల మధ్య? - అరసికుల మధ్య ఏ విద్యా కూడా రాణించదు. ఓ గాయకుడు తంబురా శృతి చేసుకొని కర్ణపేయంగా గానం చేస్తుంటే డబ్బు తప్ప మరో విషయం పట్టని పంతులు, పోలిశెట్టిల కోవకు చెందిన ఓ పెద్దమనిషి కలిగించుకొని - "సంగీతకాడ! పాడ కిక చాలించు, నీ వది పాడినందుకున్ ఇంగిత మెరిగి నేను మరి విన్నందుకునే సరిపోయె -" అన్నాట్ట. అంతటితో కూడా ఊరుకోకుండా- "రంగున నే తలూపినట్టి యప్పుకు తంబుర యీడ బెట్టిపో..." అని కూడా శలవిచ్చాడుట. "నువు పాడిన దానికి నే విన్నదానికి సరిపోయింది: తలూపినందుకు తంబురా యిచ్చిపో..." అన్న యీ మహానుభావుడి తెలివితేటలను ఎంతని కొనియాడగలం?- అసలు ఇలాంటి మనుషులే లోకంలో ఎక్కువై పోతున్నా రనేదే నా విచారం!

"అల తాళ్ళపాక అన్నమయ రోమములైన తంబుర దండెకు తంత్రులౌనె?" అంటూ ఓ కవి వెటకారం చేశాడు కాని తాళ్ళపాక కవులు పలికిందల్లా పదమే అయింది. పాటే భగవంతుని సన్నిధికి దివ్యమైన బాట అని యీ కవు లంతా నమ్మారు. అన్నమయ పదాలలో సంగీత, సాహిత్యాలే కాక భక్తిరసం కూడా కలిసి పోయి - తెలుగువారికి వెలలేని సంపదలా మిగిలిపోయింది. "సంగీతామృత ధారల నంగీకృతమైన యట్లు యాగాదులచేతం గరగదు సంతోష తరంగితమై మన్మనంబు రమ్య చరిత్రా!" అన్నాడో కవి. సంగీతంతో తన్మయమైనట్లు మరే యితర ప్రక్రియా విశేషంతోను తన మనసు కరగదని సాక్షాత్తు ఆ శ్రీమన్నారాయణ మూర్తే అన్నా డంటాడు యీ కవి.

"దండె తంబుర స్వర మండలంబు రబాబు వేటు గజ్జెలు ముఖవీణ డక్క... కిన్నెర తాళంబు బిల్లగ్రోవి- " అంటూ ఓ కవి వాద్య విశేషాలను వర్ణిస్తే - "కాంభోజి కేదారగౌళ శోకవరాళి పున్నాగ గుమ్మకాంభోజి శంకరా భరణము మేఘరంజి తోడి వరాళి నాదనామక్రియా నాట రీతి గౌళ -" అంటూ సంగీత శాస్త్రంలోని సమస్తరాగాలను ఏకరువు పెడతాడు మరో కవి. ఇవన్నీ కూడా కవులకు సంగీతం పట్ల తమకు గల అభినివేశాన్నే తెలుపుతూ వున్నాయి.

శిశువులు, పశువులు, పాములే కాక పాటలకు మొక్కలు కూడా పులకిస్తాయంటాడు గేయకవి. "పాట పాడితె చాలు తోట పులకించేను, వింటూనె ప్రాణాలు విడిచిన చాలమ్మ-" అంటా డీయన. పాట అనగానే వెనక భావకవులకు కోయిల గుర్తుకు వచ్చేది. "కోయిలా కోయిలా కూయబోకె గుండెలూ బద్దలూ చేయబోకె, తీయని రాగాలు తీయబోకే, తీపితో నా మనసును కోయబోకే-" అని ఓ కవి కోయిలతో సరాగా లాడితే -" రావే రావే కోయిలా రాగము తీయవె కోయిలా-" అంటూ మరో కవి కోకిలను బతిమాలతాడు కోయిలను పిలవటం అంటే వసంతాన్ని ఆహ్వానించటం అన్న మాటేగా! ఏమిటో వీణను చూసేసరికి మధుర స్వరా లేవో మనసున మోగినట్లయి యిలా ఎక్క డెక్కడి విషయాలూ జ్ఞాపకం వస్తున్నాయి గదిలో ఒక్కదాన్నే తలుపులేసుకు కూర్చుని వీణ వాయించుకుంటున్నా పంతులుగారికి అనుమానమే వీణ కింద ఎవరేనా వున్నారేమో నని వెదికే

బాపతు మనిషి ఆయన. ఇటువంటి వ్యక్తుల మధ్య కాలం గడుపుతున్నా నాలో సాహిత్యం పట్ల జిజ్ఞాస కరిగిపోక పోవటం సంగీతం పట్ల మక్కువ తరిగిపోక పోవటం నా అదృష్టమనే చెప్పాలి. "రాగమున నేకమైన స్వరమ్ము రీతి తన్మయత చెంది, కల సమస్తమ్ము విడిచి 'లీనమై పోతి'నీ దివ్యగాన సుధను-" అంటుందిట గోకుల కృష్ణుడి మురళీధ్వని విన్న గోపిక. "సత్పురుషుడనే నామము సార్థకము కాగల యీ సత్పురుషుణ్ణి నీకిచ్చాను. ఆయన స్నేహం బలమైన కొలదీ మా బోంట్లను తలచవు-" అంటాడు సౌజన్యారావు పంతులు భగవద్గీత పుస్తకాన్ని నాకిస్తూ. ఆయన పలుకులే నిజమయి మురళీకృష్ణుని వేణుగాన ధ్వనులే ఎల్ల వేళలా వీనుల విందుగా వినిపించటం కంటె నాకేం కావాలి?

## కీర్తి...

మోకరిల్లి బానిసలకు బానిసవై బతిమలాడినా
లొంగని, మనసు కరగని అమ్మాయి లాంటిది కీర్తి
ఐనా ఆమె చెంపలపై సిగ్గు మొగ్గలు తొడుగుతూనే ఉంటుంది.
చూస్తూ వుండగానే బుర్ర లేని బుద్ధిహీనుడెవడికో లోబడిపోతుంది.
ఉన్మత్తంగా అతన్ని ప్రేమిస్తుంది.
ఆమె జిప్సీ!
ఆమె లేకున్నా ఆనందంగా వుండలేని వాళ్ళతో ఆమె మాట్లాడదు.
ఆమె మోసగత్తె!
ప్రణయం పల్లవించే గుసగుసలకు ఆమె చెవివొగ్గదు.
ఆమె గురించి ఆలోచనల్లో పడిన వాళ్ళు
ఆమె గురించి చర్చించుకొనేవాళ్ళు
ఆమె కపట బుద్ధి గురించే ముచ్చటించు కుంటారు
ఆమె జిత్తుల మారి జిప్సీ!
ప్రేమ జ్వరంలో బలహీనపడిన మీరు
ఆమె తిరస్కారానికి ప్రతిఫలంగా తిరస్కారాన్నే ఇవ్వడం నేర్చుకోండి!
కళాకారులారా! దిక్కు మాలిన కవులారా!
దిగులు నిండిన కళాకారులారా!
మీరంతా పిచ్చిముదిరి పోయిన వాళ్ళు
మీరంతా వీలయినంత వరకు ఆమె ముందు మీ తలలు వంచండి
నమస్కరించండి! వినమ్రంగా ప్రణమిల్లండి!
అప్పుడు, అప్పుడు
ఒక వేళ ఆమె మనసులో అనురాగం మొలకెత్తితే
మిమ్మల్ని ప్రేమతో చూస్తుందేమో!
దయదల్చి మిమ్మల్ని అనుసరిస్తుందేమో!

**మూలం - జాన్ కీట్స్ అనువాదం - సౌభాగ్య**

# అల్పాయుర్దాయం - అనల్ప కవితాప్రతిభ

## (కీట్స్ కవితకు అప్పుడే రెండొందల ఏళ్లా?)

- హెచ్. ఆర్.కె.

ఎందరు గాయకులు కాలం అంచులకు జరీ మెరుపులో!
వారిలో కొందరు నా ఆనందోహలకు ఆహారం, ఊపిరి!
భవ్యమో దివ్యమో వారి అందాలలో మునక లేస్తుంటాను
తరచు నేనొక పద్యమవుదామని తీరిక చేసుకున్నప్పుడు
గుంపులు గుంపులుగా వచ్చి వాలి నా ఆలోచనలను
ఆవహిస్తుంటారు, అలాగని, నన్ను గందరగోళ పరచరు
మొరటుగాపనిభంగమూ చేయరు- ఆహ్లాదకర చిరుగంటల నాదాలు
సరిగమలను పట్టించుకోని సాయం సమయ సుస్వరాలు
పిట్టల పాటలు - ఆకుల గుసగుసలు - కదిలే నీళ్ల
కమ్మని స్వరాగాలు - గంభీరంగా ఊగే ఘంటికారావం-
అడ్డగోలు అరుపులు కాదు, మనోహరమైన శ్రుతి లయలు!
(ఎందరు గాయకులు - హౌ మెనీ బార్డ్స్)

రెండొందల ఏళ్ల నాటి సంగతి. అప్పటికి ఇంకా మనుషులకు చల్లని సాయంత్రా లుండేవి. బరువైన చర్చి గంటలు మెత్తగా మోగి మనసులను తట్టి లేపేవి. చెట్ల కొమ్మల్లోంచి కోయిలలు మత్తుగా కూసేవి. నీటి గలగలలతో, ఆకుల గుసగుసలతో ఎవరూ పని గట్టుకుని స్వరాలు కూర్చని సాయం సంగీతం మనుషులను సేద దీర్చేది. అలాంటి రోజుల్లో ఇంగ్లాండులో కేవలం పాతికేళ్ళు - అదీ చాలా అస్థిరంగా - జీవించి ఒకానొక అమూర్త సౌందర్య భాషలో తన కాలాన్ని రికార్డు చేసిన కవి కుమారుడు జాన్ కీట్స్. "హృదయ స్పందనల్లోని పవిత్రత, ఊహాశక్తిలోని సత్యం తప్ప మరేదీ నాకు విశ్వసనీయంగా కనిపించదు" అంటూ కవితకు, జీవితానికి అభేదం చెబుతూ అర్ధాంతరంగా కలం మూసిన అక్షర సౌందర్యం జాన్ కీట్స్.

'నేను చనిపోయాక ఇంగ్లీషు కవి శ్రేణుల మధ్య ఉండిపోతా'నని **1818** అక్టోబర్ **14-15**న రాసుకున్న ఓ లేఖలో ఆశపడ్డాడు కీట్స్. రెండొందల ఏళ్ల తరువాత నేడు కీట్స్ మాటల్లో అహంకారం కాకుండా విషాదకర వినయమే ధ్వనిస్తుంది. విరిసీ విరియని పువ్వు అనంత పరిమళాలను మిగిల్చి రాలి పోయింది. బ్రతికింది కేవలం పాతికేళ్లు,కవిత్వ రచనా కాలం మరీ నాలుగేళ్లే. కాలం కాటేయక పోయి ఉంటే ఆ పువ్వు వికసించి ఇంకెన్ని అద్భుతాలు ప్రదర్శించి ఉండేదో!

కీట్స్‌ను చాలామంది చాలా విధాలుగా జ్ఞాపకం చేసుకుంటారు. కాల్పనిక వాద కవితాయుగ నక్షత్రం కీట్స్‌ను యువకవులు మరీ ప్రత్యేకంగా గుర్తు చేసుకోవలసి ఉంటుంది. సాహిత్యాన్ని కీట్స్ నియత పద్ధతిలో చదువుకుని కవి కాలేదు. కవి కావాలన్న తపనతో చదువుకున్నాడు. షేక్స్పియర్, స్పెన్సర్, మిల్టన్‌లను జీర్ణించుకున్నాడు. సమకాలికులయిన చార్లెస్ కౌడెన్ క్లార్క్, బెంజామిన్ రాబర్ట్ హేడన్, హాజ్లిట్, వర్డ్స్‌వర్త్, లాంబ్, షెల్లీలతో కలిసి తిరిగాడు. కవిత్వం హృదయ వ్యాపారమని భావించినా బుద్ధి ప్రాధాన్యాన్ని ఆయన విస్మరించలేదు. "ఆలోచించే మనుషులకు విస్తృత పరిజ్ఞానం

అవసరం... ఉన్నత స్పందన శక్తితో పాటు విజ్ఞానం ఉండడం, ఉండక పోవడం అనే రెండు పరిస్థితుల మధ్య వ్యత్యాసం ఉంది. రెండవ పరిస్థితిలో ఎప్పటికప్పుడు పది వేల అడుగుల లోతులకు పడి పోతూఉంటాం, తిరిగి పైకి విసరబడుతూ ఉంటాం, కాని రెక్క లుండవు, రెక్కలు లేని ప్రాణులన్నిటి వలె భయంకర స్థితికి లోనవుతూ ఉంటాం. మొదటి స్థితిలో నయితే - మన భుజాలకు రెక్క లుంటాయి. గిరికీలు కొడతాం గాని, నిర్భయుల మవుతాం". అందుకని - కేవలం స్పందించే గుణం (సెన్సేషన్) ఉంటే చాలదు. జ్ఞాన సముపార్జన కూడా కవికి అవసరమే. కీట్స్‌లో జ్ఞానం స్పందనగానూ, స్పందన కవితా భావనగానూ పరిణతి చెందాయి.

పాతికేళ్ల జీవితం అంతటా కీట్స్ రెండు రకాల జీవితాల మధ్య సమతూకం సాధించడానికే ప్రయత్నించాడు. ఒకటి కవికి ఉద్దిష్టమైన ఊహాలోకం. రెండవది తన చుట్టూరా ఉన్న భౌతిక ప్రపంచం. చిన్ననాటి నుంచీ కుటుంబంలో ఒకటి తరువాత మరొక మృత్యువు సంభవించి, చావుల పరంపరే జీవితం అనిపించింది. కీట్స్ కవిత్వంలో మృత్యువు ఒక విషాద సౌందర్యమై నీడలా పరుచుకుని ఉంటుంది. లోకం తెలిసే నాటికి ఒక అన్న, ఇద్దరు తమ్ముళ్లు, ఓ చెల్లి మిగిలారు. వారి పట్ల తన బాధ్యతలను కీట్స్ విస్మరించలేదు. తాను లేనప్పుడు చెల్లి గురించి శ్రద్ధ తీసుకోవలసిందిగా ప్రేయసి ఫానీ బ్రాన్‌ను ప్రత్యేకించి కోరాడు. ఆయన కవిత్వం తరువాత ఇష్టంగా చదవాలనిపించేవి ఆయన ఉత్తరాలు. వాటిలో మిత్రుల పట్ల ప్రేమ, బౌద్ధిక, వృత్తిపర విషయాల పట్ల మమకారం - వాటన్నిటిలోనూ పూసల్లో దారం వలె కవితానిబద్ధత తొణికిసలాడుతూ ఉంటాయి. ఫానీ బ్రాన్‌తో తన సంబంధాలు తనను తాను తెలుసుకోడానికి సాగించిన వేదనాత్మక పోరాట మయ్యాయి. ప్రేమ-మృత్యువు అనే సుప్రసిద్ధ సమీకరణంలో ఆ పోరాటం విలీన మయింది. ప్రేమను, మృత్యువును ఒకేసారి పొందాలన్న తపన ఆయన కవిత్వంలోనూ వ్యక్తమయింది. ఆయన దృష్టిలో జీవితమనేది 'ఆత్మలు రూపొందే లోయ' (Vale of soul making). పరిసరాల్లోని భౌతిక జీవితాన్ని శ్రద్ధగా పట్టించుకున్నాడనడానికి ఆయన విద్యా వ్యాసంగం మరో తార్కాణం. చేపట్టిన వైద్య విద్యాభ్యాసం కవిత్వానికి అవరోధ మనుకున్నా, అది కొద్ది కాలమే. త్వరలోనే ఆ భావన తప్పు అని గుర్తించాడు. కవన కుతూహలాన్ని వదులుకోకుండానే వైద్యవిద్య కొనసాగించడం అవసరమనీ, సాధ్యమనీ గుర్తించాడు. "మన కళ్ల ముందున్న ప్రతి జ్ఞాన విభాగమూ గొప్పదే. ఒక సమగ్రత్వం దిశగా పయనానికే ప్రతిదీ దారి తీస్తుంది. ఈ విషయం నా కెంత బాగా అర్థ మయిందంటే, వైద్యగ్రంథాల్ని అటక ఎక్కించనందుకు ఇప్పుడు నాకెంతో సంతోషంగా ఉంది. ఇప్పటికి నాకు తెలిసిన దాన్ని సమగ్రత్వం దిశగా పయనాన్ని సజీవంగా కొనసాగించడానికే ఉపయోగించుకుంటాను" అని 1818 మే నెలలో రాశాడు. ఆ మాట కేవలం కపాల సరసిలో చిరు వక్ర తరంగం కాదు. కవిలోకంలో ప్రవేశానికి తపన పడుతూనే వైద్య విద్యను సహ విద్యార్థు లందరికన్నా ముందుగా ముగించి వారికి అసూయా హేతువయ్యాడు. భౌతిక, ఊహా లోకాల మధ్య సమతూకం కోసం కీట్స్‌చేసిన ప్రయత్నానికి ఇదొక చక్కని ప్రతీక.

రాజకీయ విషయాలలోనూ కీట్స్‌కు ఆసక్తి ఉండేది. ఫ్రెంచి విప్లవం తరువాత టోరీల ఎదురు దాడి ఇంగ్లాండులో ప్రగతికి ఆనకట్ట వేసే పరిస్థితి ఏర్పడింది. తన మాతృభూమి ఈ అవరోధాన్ని అధిగమించి తిరిగి ముందడుగు వేయాలని కీట్స్ కోరుకున్నాడు. ఆయన అసంపూర్ణ కావ్యం హైపెరియాన్ ఈ కోరికనే ప్రతిఫలిస్తుందని కెన్నెత్ మ్యూర్ అంటాడు. కీట్స్‌కు రాజకీయ విషయాల్లో

ఆసక్తి ఉండేది. అందుకోసం జర్నలిస్టు కావాలని కూడా అనుకున్నాడు. అయితే రాజకీయాంశాలు ప్రవేశించి పద్యాల్లో కవితాత్మను పాడు చేయకుండా జాగ్రత్త పడా లనుకున్నాడు. ఈ వైఖరిలోని బాగోగులు చర్చనీయాంశ మయినా, అది కీట్స్ వ్యక్తిత్వాన్ని సూచిస్తుందని మాత్రం చెప్పవచ్చు.

కవన వనంలో విమర్శక తోడేళ్లను చూసి జడుసుకునే యువ కవులకు కీట్స్ జీవితం మంచి పాఠం. ఆయన కవితాజీవితంలో గణనీయ భాగం ఖర్చయిన సుదీర్ఘ కవిత 'ఎండెమియాన్'. ఈ పుస్తకం ముందుమాట కీట్స్ పరిణతికి నిదర్శనం. "బాల్యంలోని ఊహలు ఆరోగ్యకరం. పెరిగి పెద్దయ్యాక పరిపక్వ ఆలోచనాలూ ఆరోగ్యకరమే. ఈ రెండింటి మధ్య ఒక దశ ఉంటుంది. ఆత్మ స్వస్వరూపం పొందడం కోసం కళపెళ లాడుతూ ఉంటుంది. వ్యక్తిత్వం స్పష్టంగా ఉండదు. జీవన వైఖరి స్థిరపడదు... ఆ స్థితి నుంచి ఒక వ్యర్థ నిరాశావహ స్థితి (మాకిష్‌నెస్) ఉత్పన్న మవుతూ ఉంటుంది..." ఇవి తన పద్యానికి ముందు మాటలో తానే రాసుకున్నా వాక్యాలు. ఇలా ఆత్మవంచన లేకుండా అద్దం చూసుకోగల వాడికి ఏ విమర్శకుడితోనూ పని ఉండదు. కాని, ఎడిన్‌బర్గ్ మాగజైన్‌లో 'జడ్' అనే విమర్శకుడు చేసిన క్రూరమైన దాడికి కీట్స్ వికలమనస్కు డయ్యాడు. ఇదంతా "చొల్లుగారే బాల్య చేష్ట" (డ్రివెల్లింగ్ ఇడియసి) అని తిట్టి పోశాడు. 'జడ్' గారి అసలు పేరు జాన్ గిబ్సన్ లొఖార్ట్ అని ఆ తరువాత ఎప్పుడో బయట పడింది.

'ఎండెమియాన్' లోని అపరిపక్వతను కీట్స్ స్వయంగా గుర్తించాడు. పద్యంలో కొన్ని భాగాలు అప్పటికి ఇంకా రాబోతున్న ఒక మహాకవిని పట్టి ఇస్తాయి. నిజానికి ఆ పద్యాన్ని తన భవిష్యత్ కవితా రూపానికి ప్రయోగశాలగా భావించాడు కీట్స్. విమర్శకుడి దాడి మరీ క్రూరంగా పరిణమించింది. కొన్నాళ్ల పాటు ఆ నొప్పినుంచి బయటపడలేక పోయాడని సన్నిహితుల ఉవాచ. దానివల్లనే ఆయన అర్థాంతరంగా కన్ను మూశాడని అంటారు. అలా అనుకున్న వారిలో మహాకవి బైరన్ వంటి వారూ ఉన్నారు.

'అత్యున్నతమైనది సాధిస్తానని ఆశలు కల్పించిన వాడు
జాన్ కీట్స్ ఒక విమర్శకుడి చేతిలో హతు డయ్యాడు
... .... ... ...
ఎంత విచిత్ర మీ మస్తిష్కం, అంతటి అద్భుత పదార్థం
ఒక వ్యాసం దెబ్బకు తాళలేక ఆరిపోవడమా?'

అని బాధ పడ్డాడు బైరన్. 'జడ్' దాడి కీట్స్‌ను చాలా గాయపరచిన మాట నిజమే. నిద్రలేని రాత్రులు గడిపిన మాట నిజమే. అయినా, అదే ఆయన ఆకస్మిక మరణానికి దారి తీసిందనడం సరి కాదంటారు పలువురు విజ్ఞులు. "బ్లాక్ వుడ్ (పత్రిక సంపాదకుడు) గాని, ఆ పత్రిక గాని గాయపరచిన దాని కంటె నా స్వయంవిమర్శే (డొమెస్టిక్ క్రిటిసిజమ్) నన్ను ఎక్కువ వేదనకు గురి చేసింది. రెండింటి మధ్య పోలికే లేదు" అన్న కీట్స్ మాటలు సత్యదూరం కాదు. "అమూర్తసౌందర్యం మీది మమకారంతో తన రచనలను తాను విమర్శించుకోగల మనిషి మీద పొగడ్త లయినా, తెగడ్తలయినా ఎక్కువ కాలం ప్రభావం చూపలేవు" అన్నారు కీట్స్. ఈ వాక్యంలోని అంతర్‌గర్భిత వేదన స్పష్టమే అయినా, ఇటువంటి పరిస్థితులనే ఎదుర్కోగల యువ కవులకు ఇది ఒక కరదీపిక. తనను తాను మరిచి పోయి పరిసరాల్లో కలగలిసి పోయే వస్తుగత దృష్టి, ఊహాశక్తి కీట్స్‌కు పుట్టుకతో న విద్యలు. తనను తాను కూడా అదే వస్తుగత దృష్టితో సమీక్షించుకునే శక్తి ఆయనకు ఉంది.

ఊహ, సౌందర్యాలలోని నైతిక విలువలపై కీట్స్ విశ్వాసం అచంచలమైనది. "హృదయ సంస్పందనలు తప్ప, ఊహా శక్తిలోని సత్యం తప్ప మరేదీ నాకు ధ్రువీకృత విషయం కాదు" అనడంలో ఆయన విశ్వాసం, ఆత్మ విశ్వాసం రెండూ స్పష్టమవుతాయి. పాత కట్టుకథల్లోంచి మానవతా సారాన్ని ఆవిష్కరించడం సాధ్యమని గుర్తించిన వారిలో కీట్స్ మొదటి వాడని ఎడిన్‌బర్గ్ రివ్యూలో జెఫ్రీ తేల్చిన సారం అత్యధిక కవితా ప్రేమికులకు ఆమోదయోగ్య మయింది. స్వయంవిమర్శక శక్తి, ఊహల్ని రెక్కలుగా ధరించగల నైపుణ్యం, నైతిక విలువల పట్ల విశ్వాసం, పరిసర వస్తువులలో పరకాయ ప్రవేశం చేయగల వస్తుగత దృష్టి కీట్స్‌ను అవిస్మరణీయ కళాకారుడుగా నిలబెట్టాయి.

కీట్స్ కవిత్వం పుస్తకాలకు పూచిన పువ్వు కాదు. ఆయన తన కవితా మార్గం తాను ఎంచుకుని తన కవితను ఒక ప్రాణిగా మలచిన వైనం కవులందరికీ అధ్యయనాంశం. తనను ఆశ్చర్య పరచిన వర్ణ చిత్రాలు, శిల్పాలు, వాస్తు కళా విశేషాలనుంచి తన కవితా రూపాన్ని నిర్మించుకున్న ప్రతిభాశాలి కీట్స్. దీని వల్ల కీట్స్ కవిత తన సమకాలికులలో చాలా అరుదైన 'ప్లాస్టిక్' గుణాలను సంతరించుకుంది. ఊహలు విస్పష్ట, నిర్దిష్ట రూపం ధరించి పాఠకుడి మనోనేత్రం ముందు సాక్షాత్కరిస్తాయి. కీట్స్‌ను చదువుతూ పాఠకుడు మధ్య యుగ కోరింథియన్ అంతఃపురాల్లోని సందుగొందుల్లో గోథిక్ చర్చీల నేల మాళిగల్లో తిరుగుతున్న అనుభూతి పొందుతాడు. మంచి శిల్పాల విషయంలో చేతులతో తాకి పొందగల అనుభవాన్ని - కేవలం కళ్ల ద్వారా అందుకోగలుగుతాం. ఇలా దృశ్యాన్ని స్పర్శకు ప్రత్యామ్నాయం చేసే 'టాక్టైల్ ఇమేజరీ' కీట్స్ కవితకు ప్రాణం.

హైపెరియాన్, 'బుక్- 2'లో సైతాను కూర్చుని వున్న వైనాన్ని కీట్స్ ఎంత గొప్పగా దృశ్యమానం చేస్తాడో చూడండి:

'ఒక లోయ విషాద ఛాయలో లోలోపల
ఉదయ సమీరం ఇసుమంతయినా ప్రసరించనంత
చంద్ర కిరణం, సాయం నక్షత్రం కనిపించనంత లోపల
శిలాకృత నిశ్శబ్దంలా కూర్చుని ఉన్నాడు నెరిసిన తల సైతాను,
తనచుట్టూ గడ్డ కట్టిన నిశ్శబ్దం కన్నా నీరవ స్థితిలో.
తన తల చుట్టూ వేలాడుతూ అడవుల మీద అడవులు
గగనంలో మేఘాల మీద మేఘాల దొంతరల మాదిరి'

ఆరు బయట శిల్పాన్ని పోలిన సైతాను ఆదిమ వైభవం ఈ కవితా చరణాల్లో కళ్లకు కడుతుంది. దట్టమైన అడవులు, మేఘాల దొంతరలు దృశ్యానికి వాస్తవికతను సంతరించడమే గాక, ఒక సమగ్ర వాతావరణాన్ని స్ఫురింప జేస్తాయి. వర్ణ చిత్రానికి భిన్నంగా, శిల్పం బాహిరకాంతి మీద ఆధారపడుతుంది. సైతాను వర్ణనలో కాంతి లుప్తమై ఒక దిగులు విషాద మానసికావస్థను సృష్టిస్తుంది. హైపెరియాన్ 'బుక్ - 2' లో పదచ్యుతులయిన పురాతన దేవతలు కోప, భయ, ఆందోళన కలిత మనస్కులై-కీట్స్ పద చిత్రాల్లో - ఇంప్రెషనిస్టిక్ శిల్పాన్ని గుర్తు చేస్తారు. చదువుతున్న సమయంలో మన మూడ్స్‌ను బట్టి దృశ్యాన్ని చూసే కోణాలను బట్టి భిన్న రీతుల్లో దర్శనమిస్తారు:

'ఒక చీకటి పర్వత సానువుమీద
వాళ్ళ తలలు కనిపించాయి, వాళ్ళు క్రమంగా పెరిగి పోయారు

కొండ నెత్తం మీద వారి పాదాలకు పట్టు చిక్కి స్థిరంగా నిలబడే వరకు.
గూళ్లు కట్టిన తన వేదనను విస్తరించినట్లు
అప్పుడు ధియా వణుకుతున్న చేతులు బార చాపింది'

అంటాడు కీట్స్. చదువుతున్న మనం ఒక్కసారిగా మరో అపరిచిత లోకంలోనికి కీట్స్ చిటికెన వేలు పట్టుకుని ప్రవేశిస్తాం. పుస్తకం మూసేసినా దృశ్యం మన మనోవీధులను వీడదు. ఈ కవితా శిల్పం వల్ల కీట్స్ తన పద్యాలకు లోతునే గాక విస్తృతినీ సాధించాడు. ఇతరుల చైతన్యంలోనికి - చివరికి నిర్జీవ వస్తువుల ఆత్మను దర్శించగల స్థితిలోనికి తాను వెళుతూ మనల్ని తీసుకువెళతాడు కవికుమారుడు కీట్స్. బిలియర్డ్స్ బంతి ఎంత నునుపుగా ఉంటుందో తెలిసిందే. అంత మృదువుగా అది దొర్లి పోతుంది. బంతి తన నునుపు - చేతనతో మృదుత్వం సంతరించుకున్నట్లు భావించడంలో కీట్స్ పరకాయప్రవేశ విద్య పరాకాష్ఠకు చేరిందంటాడు రిచర్డ్ వుడ్‌హౌస్.

ఇంతా చేసి అదంతా ఒక ప్రారంభం. అంతలోనే వేదిక ఖాళీ అయిపోయింది. అందరూ పదే పదే మననం చేసుకునే ఐదు ఓడ్స్ కూడా తన కవితాభ్యాసంలో భాగంగానే భావించాడు కీట్స్. ఆయన కేవలం ఒక క్రూర విమర్శకే రెక్కలు తెగిపడిన కోయిల కాదని చెప్పవచ్చు. తన సమకాలికు లందరూ .దాదాపుగా రహదారుల్లో పయనించి వచ్చిన వారే. ఆయన తన వైపు అడవుల్లోంచి తానే కాల్దారి చేసుకుని నడిచి వచ్చిన వాడు. నాన్న, అమ్మ, తమ్ముళ్లు, తాతయ్య ఒక్కొక్కరే వరుసగా కన్ను మూసి మృత్యువును అనుభవైకవేద్యం, ఆస్వాదయోగ్యం చేశారేమో! చరిత్రలో 'అయితే' లకు, 'కానీ' లకు అర్థం ఉండదు. ఏమి జరిగిందో అది జరిగింది. ఆయువు అల్పమయినా, ఆ సంగతి తనకుముందే తెలిసినట్లు తన విద్యలను హృద్యంగా ప్రదర్శించి మరీ 'సెలవు' అన్నాడు కవితా శిల్పి జాన్ కీట్స్. కవిత్వాన్ని జీవితంగా మలచుకోదలచిన వారందరికీ ఆయన స్వల్ప కాలిక జీవితం అనల్పమయిన గని. కాల్పనిక వాద (రొమాంటిక్) కవుల యుగం అయిపోయింది. తెలుగులో కూడా. కాని, ఊహాశక్తికి, శిల్పానురక్తికి కీట్స్ ఇచ్చిన ప్రాముఖ్యం ఇవ్వకుండా ఏ కవీ కవి కాలేడు. 'ఏదియు సులభమ్ముగా సాధ్యపడదు లెమ్మ, నరుడు నరుడౌట ఎంతొ దుష్కరము సుమ్మ' అని దాశరథి వాక్కులో పలికిన గాలిబ్ గీతాన్ని గుర్తు చేసుకుంటే అంత తక్కువ సమయంలో అంత ఎత్తులను తాకిన కీట్స్ కవిత్వం వెనుక కృషి ఎంత సాంద్రమో ఇట్టే తెలిసి పోతుంది. ఎందరు గాయకులు - మనకు మన చల్లని సాయంత్రాన్ని తెచ్చి ఇవ్వడానికి. ఆ పిట్టలపాటల్లో, నీటి గలగలల్లో, చిగురుటాకుల గుసగుసల్లో, దేవాలయం గంటల మృదు స్వనాల్లో ఇప్పటికీ కీట్స్‌ను చదువుకోవచ్చు. శరీరానికి స్నానం లాంటిది మనసుకు కీట్స్ కవిత!

పేపర్ ధరలు, ప్రింట్ చార్జీలు విపరీతంగా పెరుగుటవలన **'మిసిమి'** 1996 జనవరిసంచిక నుండి, విడిప్రతివెల రూ.6.00 సంవత్సర చందా రూ. 70 - పెంచటమైనది పాఠకులు గమనిసారని ఆశిస్తాము.

